

''శకుంతల జన్మవృత్తాంతం'' –రవి వర్మ చిత్రం

# మిసిమి

మాస పత్రిక

***"All that we are is the product of what we have thought," is "We are what we think." — Dammapada.***

సంపుటి 6 | మే 1995 | సంచిక 70

సంపాదకుడు : **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



ముఖచిత్రం:
ఇంతి – ఇంద్రధనుస్సు
**East+West**

**"The Rainbow"** - Joseph Wright, Landscape artist, born in Derby, Fascinated by light effects - he is best-known for his 'Candle-Light' pictures, which prefigured the English romantic movement.

**"The Lady"** - Rajah Ravivarma. India's famous artist.

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

Compiled by
AMBROSE BIERCE (1911)

**Vote**, *n.* The instrument and symbol of a freeman's power to make a fool of himself and a wreck of his country.

**Washingtonian,** *n.* A Potomac tribesman who exchanged the privilege of governing himself for the advantage of good government. In justice to him it should be said that he did not want to.

They took away his vote and gave instead
The right, when he had earned, to eat his bread.
In vain-he clamors for his ""boss," poor soul,
To come again and part him from his roll.

*Offenbach Stutz.*

**Weaknesses,** *n. pl.* Certain primal powers of Tyrant Woman wherewith she holds dominion over the male of her species, binding him to the service of her will and paralyzing his rebellious energies.

**Wedding,** *n. A* ceremony at which two persons undertake to become one, one undertakes to become nothing, and nothing undertakes to become supportable.

**Werewolf,** n. A wolf that was once, or is sometimes, a man. All werewolves are of evil disposition, having assumed a bestial form to gratify a bestial appetite, but some, transformed by sorcery, are as humane as is consistent with an acquired taste for human flesh.

**Wheat,** *n.* A cereal from which a tolerably good whiskey can with some difficulty be made, and which is used also for bread. The French are said to eat more bread per capita of population than any other people, which is natural, for only they know how to make the stuff palatable.

**White,** *adj.* and n. Black.

**Widow,** n. A pathetic figure that the Christian world has agreed to take humorously, although Christ's tenderness towards widows was one of the most marked features of his character.

**Wine,** *n.* Fermented grape-juice known to the Women's Christian Union as ""liquor," sometimes as ""rum." Wine, madame is God's next best gift to man.

**Wit,** *n.* The salt with which the American humorist spoils his intellectual cookery by leaving it out.

**Witch,** *n.* (1) An ugly and repulsive old woman, in a wicked league with the devil. (2) A beautiful and attractive young woman, in wickedness a league beyond the devil.

**Witticism,** *n.* A sharp and clever remark, usually quoted, and seldom noted; what the Philistine is pleased to call a ""joke."

**Worship,** *n.* Homo Creator's testimony to the sound construction and fine finish of Deus Creatus. A popular form of abjection, having an element of pride.

**Yankee,** *n.* In Europe, an American. In the Northern States of our Union, a New Englander. In the Southern States the word is unknown. *(See DAMYANK.)*

**Yoke,** *n.* An implement, madam, to whose Latin name, jugum, we owe one of the most, illuminating words in our language-a word that defines the matrimonial situation with precision, point and poignancy. A thousand apologies for withholding it.

# తల్లి తండ్రుల నుంచి పిల్లలు కోరేది...

– 'మిసిమి' రచనల వర్క్‌షాప్

జాతి, మతం, కులం, వర్గం లాంటి వాటికన్నా అతీతమైన స్థానం తల్లిదండ్రులది. తమ పిల్లల సంరక్షణ, బాధ్యత తల్లి దండ్రులందరికీ సమానమే. పిల్లలను సక్రమ మార్గంలో పెంచడం అంత సులభమైన విషయం కాదు. పెరుగుదలతోపాటు వివిధ దశల్లో ముంచుకొచ్చే మానసిక, శారీరక పరివర్తనలను గుర్తెరిగి వాటి పరిష్కార మార్గాలను కాలానుగుణంగా కనుగొనడం తల్లిదండ్రుల వివేకానికి ఒక అగ్నిపరీక్ష.

ముఖ్యంగా తమ విశ్వాసాలకు, పద్ధతులకు, నవీన కాలపు విశ్వాసాలకు, పద్ధతులకు మధ్య సమన్వయాన్ని కుదుర్చు కోవడంలో తల్లి దండ్రులు ఎక్కువ శ్రమ పడవలసి వస్తోంది. అయినా తప్పదు. తమ పిల్లలను క్రమశిక్షణలో వుంచడంతో పాటు తాము కూడా క్రమశిక్షణను పాటించవలసి వుంటుంది. పుచ్చుకోవడం కంటే ఇచ్చుకోవడానికి అధిక ప్రాముఖ్యత నివ్వాలి. ప్రేమను ఆశించడం కంటె ప్రేమను పంచుకోవడమే ముఖ్యం. ఒక నూతన తరాన్ని తీర్చి దిద్దడంలో వారు మనస్ఫూర్తిగా చేయవలసింది చాలా వుంది.

కాని యీనాడు తల్లిదండ్రులు, పిల్లల మధ్యగల సంబంధంలో పరస్పర అవగాహన లోపించింది. పరస్పర సంప్రదింపులు మృగ్యమయ్యాయి. పిల్లలు సహజంగా తల్లిదండ్రుల నుండి ఆశించేది ప్రేమ, శ్రద్ధ, స్నేహం. వాటిని అందిస్తే పిల్లలు మానసిక వికాసంలో అంతర్లీనమై వున్న శక్తియుక్తులను పరిపూర్ణంగా వుపయోగంలోకి తెచ్చుకో గలుగుతారు. ''తల్లి దండ్రుల ప్రేమ కొరవడిన పిల్లలు, తమ మనసుల్లో అభద్రతా భావం పెంచుకుంటారు. అలాంటి పిల్లలు శక్తి హీనులై, వ్యాకులచిత్తులై ఆఖరుకు సమస్యగా తయారౌతారు'' అంటూ 12 సంవత్సరాల ఒక విద్యార్థి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. అలాగే యింకొక విద్యార్థి ''మా అవసరాలను దృష్టిలో వుంచుకొని, మా భావాలను మన్నించి, మమ్మల్ని అర్థం చేసుకొనే తల్లిదండ్రులు కావాలి'' అంటూ పిల్లల సగటు భావాలను తెలియపరిచాడు. యవ్వనంలో అడుగుపెట్టే పిల్లలు తల్లిదండ్రుల స్నేహాన్ని ఆశిస్తారు. ఒంటరితనంలో వున్న పిల్లలకు తల్లిదండ్రులే స్నేహితులు, గురువులు. తల్లిదండ్రులు, పిల్లల మధ్య స్నేహ సంబంధమే సత్ఫలితాలనిస్తుంది. పిల్లల వయసుతోబాటు వారి కోరికలు, ఆశలు మారుతూ వుంటాయి. వాటికనుగుణంగా తల్లిదండ్రుల ప్రవర్తన మారవలసి వుంది. ''పిల్లలను ఎక్కువగా ప్రేమించి వారిని తిట్లతోనూ, దెబ్బలతోనూ బాధపెట్టకుండా, వారి ఆంతరంగిక సమస్యలను వారితో పంచుకున్న వారే మంచి తల్లిదండ్రులు'' అని 10వ తరగతి చదివే విద్యార్థి అంటాడు. ఒక బాలిక తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ, ''పిల్లలు చేసే పనుల్లో తాము జోక్యం చేసుకోకుండా, వారిని ప్రోత్సహించే వారే ఆదర్శ తల్లిదండ్రులు'' అని చెప్పింది.

పై భావాలను వ్యక్త పరచిన బాల బాలికలందరూ సాఫీగా జీవితాలు కొనసాగుతూ వున్న

కుటుంబాల్లో పెరిగిన పిల్లలే. అయితే సుఖప్రదమైన కుటుంబ జీవితాన్ని ఆశించే పిల్లలు ఎందరో! ''నా తల్లి దండ్రులు తరుచుగా పోట్లాడు కుంటారు. కోపంతో మా నాన్న యింటి నుండి బయటకు వెళ్ళిపోతాడు'' అంటూ జీవిత అనే అమ్మాయి తన మనోవేదనను బయట పెట్టింది. ''నా తల్లిదండ్రులు అర్ధరాత్రి ఒకరినొకరు గట్టిగా తిట్టుకుంటుంటారు. చుట్టు ప్రక్కల వాళ్ల ఏమైనా అనుకుంటారనే జ్ఞానం కూడా వారికి లేదు. నేనేమైనా అంటే నన్ను కూడా తిడ్తారు'' అంటూ యింకొక అమ్మాయి బాధపడింది. అలాంటి వాతావరణంలో పెరిగే పిల్లల మానసిక వ్యధ చెప్పనలవి కాదు.

పోతే తల్లిదండ్రులు నీతి, నిజాయితీలతో వుండాలని పిల్లలు కోరుకుంటారు. అలాంటప్పుడు తల్లిధండ్రులే పిల్లలకు తప్పుడు మార్గాలను చూపిస్తే వారు సన్మార్గంలో ఎలా పోగలరు? ఒక వుదాహరణ - ఒక విద్యార్థి మొట్టమొదటిసారి కవిత్వం పోటీల్లో పాల్గొనాలనే ఉత్సాహంతో తన తండ్రి సలహాను కోరాడు. ఆ తండ్రి కొడుక్కు తెలియకుండా, ఎప్పటిదో ఒక పాత పత్రికలోని ఒక కవిత్వాన్ని కాపీ చేసి కొడుక్కిచ్చి దాన్ని పోటీలో చదవమని సలహా యిచ్చాడు. ఆ విద్యార్థి అలాగే చేశాడు. అయితే దురదృష్టవశాత్తు ఆ కవిత్వాన్ని రచించిన వ్యక్తే ఆ పోటీల జడ్జీగా వున్నారు. దాంతో ఆ విద్యార్థి ఎంత అవహేళన పాలై వుంటాడో మనం వూహించుకోవచ్చు. అలాంటి తల్లిదండ్రులను పిల్లలెప్పుడూ గౌరవించరు. పిల్లలు గర్వపడే విధంగా తల్లిదండ్రులు ప్రవర్తించాలి.

తల్లిదండ్రులు చాలా మంది తమ చిత్తాన్ని గంట గంటకు మార్చుకోవడం పరిపాటి. అలాంటి వారు తమ సంతృప్తికోసం పిల్లల నుండి ఏమి ఆశించదలచారో తెలియదు. వారితో పిల్లలు ఎలా మెలగాలో తెలియదు. ''నా తల్లిదండ్రుల్లో ఒక్కరు కూడా, నాలోని ఒకే విధమైన ప్రవర్తన వారం రోజులపాటు కూడా అంగీకరించరు. వారి మనో భావాలు స్థిరంగా వుండవు. వారితో ఎలా వేగాలో నాకు అర్థం కావడం లేదు'' అంటూ ఒక బాలిక బాధను వ్యక్తపరచింది. అలాంటి అస్థిర చిత్తంవల్ల వారి మధ్య సంబంధం తెగిపోతుంది. కొంత కాలం తర్వాత అంతరాలు పెరిగి స్పర్థలకు దారి తీస్తుంది. మొత్తం మీద ఎలిజబెత్ హర్లాక్ అనే సుప్రసిద్ధ మనస్తత్వవేత్త చెప్పినదాని ప్రకారం ఆదర్శ తల్లిదండ్రులు ఇలా ప్రవర్తించాలి:

1. పిల్లలకు కావలసినవి చేయాలి.
2. తమపై పిల్లలు ఆధారపడేటట్లు వుండాలి.
3. తమ అనుమతిని సాధ్యమైనంతవరకు యిస్తూ వుండాలి.
4. క్రమశిక్షణ పాటించే విషయంలో యుక్తాయుక్తంగా వుండాలి.
5. పిల్లల వ్యక్తిత్వాన్ని గౌరవించాలి.
6. వారిలో ప్రేమను పురికొల్పాలి గాని భయాన్ని కాదు.
7. తమకు తాము ఆదర్శకులుగా మెలగాలి.
8. అన్ని వేళల్లో మంచి స్వభావాన్ని కలిగివుండాలి.
9. పిల్లలతో సహచరుని మాదిరి ప్రవర్తించి, వారితో కలిసి పనులు చేయాలి.

10. పిల్లలపై ప్రేమానురాగాలతో ప్రవర్తించాలి.

11. పిల్లలు ఎప్పుడైనా బాధలో వున్నా యిబ్బందిలో వున్నా వారిపై జాలిని ప్రదర్శించాలి.

12. తమ స్నేహితులను పిల్లలు యింటికి తీసుకొనివచ్చేందుకు ప్రోత్సహించాలి.

13. పిల్లల వయసును బట్టి తగిన విధంగా వారికి స్వేచ్ఛనివ్వాలి.

14. అసాధ్యమైన వాటిని సాధించాలని పట్టుపట్టరాదు.

**తల్లిదండ్రులు చేయతగనివి :**

1. మీ పిల్లలను వారికంటె తెలివి తేటల్లో అధికంగా వున్నవారితో పోల్చవద్దు. కాని వారి శక్తియుక్తులను పెంచేందుకు తోడ్పడాలి.

2. చిన్న చిన్న కారణాలతో పిల్లలను శారీరక హింసలకు గురిచేయవద్దు. అలా చేసిన యెడల మీ చేతగానితనం బయటపడడమేగాక పిల్లలు మీపై అలక్ష్యాన్ని పెంచుకుంటారు. పిల్లల మనస్సుకు పదును పెట్టేవిధంగా విషయాలను వివరించి చెప్పాలి. అదే దీర్ఘకాల ఫలితాన్నిస్తుంది.

3. పిల్లల ముందు యితరులను కించపరచవద్దు. దానివల్ల మీమీద వారికి గౌరవం పోతుంది. మంచి చెడ్డలను విడమర్చి బోధించాలి. దానివల్ల వాటి భేదాలను అర్థం చేసుకోగలుగుతారు.

4. పిల్లవానికి 14 సంవత్సరాలు దాటుతూనే, తన స్నేహితుల పరిధిని కట్టడి చేయటానికి ప్రయత్నించవద్దు. అయితే ఒక కన్ను అతనిపై నిలిపి వుంచాలి. లేనియెడల కష్టాలను కొని తెచ్చుకోవచ్చు. పిల్లవానికి సరియైన జ్ఞానాన్ని అందిస్తే, తనకు తగిన స్నేహితులనే ఎన్నుకుంటాడు.

5. మనస్సులో తమ పిల్లలు అప్రయోజకులు అనే భావం వుంచుకోరాదు: దాన్ని ఉన్నట్టు పిల్లలు పసిగడ్తే మాట్లాడటానికే సంకోచిస్తారు. తత్ఫలితంగా వారి పురోగతి మానసికంగా స్థంభించిపోతుంది. ఇది చాలా ప్రమాదకరమైంది.

6. తమకు నచ్చనప్పటికీ, పిల్లలు తమ స్నేహితులను వదిలించుకొనేందుకు కఠినంగా ప్రయత్నించకూడదు. స్నేహమే పిల్లలకు యిష్టా ప్రపంచమని మరిచిపోవద్దు. అప్పుడు వారు ఎదురు తిరగవచ్చు. అయిష్టాన్ని సరియైన కారణాల్తో తెలియపరచవచ్చు కాని, అనాలోచితమైన విమర్శలకు పూనుకోవద్దు.

'వాళ్లంతా అల్లరిమూక. జులాయిగా తిరిగేరకం' - అంటూ అప్పుడే యౌవ్వనదశలో అడుగిడిన పిల్లలను గూర్చి నిష్కారణంగా విమర్శించే వాళ్ళు వుంటారు. కాని అలాంటి పిల్లల మనోగతాన్ని ఎంతమంది అర్థం చేసుకో గలుగుతున్నారు? బయట అల్లరిగా రంగేళీగా తిరిగే పిల్లల మానసిక స్థితిని అర్థం చేసుకోవాలి.

ఒక వ్యక్తి జీవితంలో కౌమార్యదశ అతి సున్నితమైన కాలం. అప్పుడే ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి. ఆ దశలోనే పిల్లలు, నిజమైన లేక వూహాజనితమైన ఒక వ్యక్తి స్వరూపాన్ని తమలో మలుచుకోటానికి ప్రయత్నిస్తారు. కొందరు ఆ స్ఫూర్తిని తమ చర్యల ద్వారా వ్యక్తపరుస్తారు. అయితే కొంతకాలం తర్వాత ఎక్కువ మందిలో ఆ భ్రమలు తొలగిపోతాయి. ఎంత ప్రయత్నించినా

ఒకరిని అనుకరించడం అంత సులువైన పనికాదు. దానికి కారణం వ్యక్తిలోని సహజగుణం. అది ఎప్పుడూ పైచేయిగానే ఉంటుంది. అయినప్పటికి వ్యక్తి ఆరాధన ప్రభావాన్ని మాత్రం తొలగించడం కష్టం. కౌమార్య దశలో తాము అందరిలో ఆకర్షింపబడాలని, అందరూ తమను మెచ్చుకోవాలని ఆరాటపడుతూ వుంటారు. అందుకే వారి పరిధిలోకి వచ్చిన వ్యక్తులనుగాని, లేక యితర రంగాల్లో పైకొచ్చిన ప్రతిభా వంతులనుగాని ఆదర్శంగా పెట్టుకొని వారిని అనుకరించటానికి ప్రయత్నిస్తారు. అలాంటి ఆరాధ్య వ్యక్తులు, పిల్లల విషయంలో దేవుళ్లతో సమానంగా భావింపబడతారు. తనకంటె పెద్దవారై,ఏ రంగంలోనైనా పేరు సంపాదించుకున్న వారిని అనుకరించడం వారిలో సహజ ప్రవృత్తి. ఇంకా కొందరు సినిమాల్లోని హీరోలను, ఇందిరాగాంధీ, యన్.టి.రామారావు, అమితాబ్ బచన్, కపిల్‌దేవ్, చిరంజీవి లాంటి వారితో ప్రభావితమౌతారు. వారి మాదిరి తాము కూడా సంఘంలో గుర్తింపబడాలనే వుబలాటంతో కలలు కంటుంటారు.

ఒక విద్యార్థి బృందాన్ని కలిసినప్పుడు వారిలో ప్రతివారికి తమకు ఆరాధ్య పురుషుడో, స్త్రీయో వున్నట్లు బయటపడింది. ఎవరో ఒక ప్రసిద్ధ వ్యక్తిని వారు ఆరాధిస్తున్నారు. అయితే వయసు పెరిగేకొద్దీ అనుభవం ఎక్కువయ్యేకొద్దీ, జీవిత సత్యానికి, భ్రమలకు వైరుధ్యమేర్పడుతుంది. ''నా చిన్నతనంలో పెద్దవార్ని ఎవరైనా కాని మెచ్చుకొనేవాణ్ణి. కాని యిప్పుడు ఆ భ్రమలన్నీ తొలగిపోయాయి. నేను మెచ్చుకున్న వారిలో ఎవరు కూడా నేనూహించిన వ్యక్తి లేడు. అదంతా ఒక భ్రమ'' అని చెప్పాడు ఒక విద్యార్థి. ''నా తల్లిదండ్రులే నాకు ఆదర్శ పురుషులు వారు నాకు ఆత్మ విశ్వాసాన్ని యిచ్చారు. వేరే ప్రఖ్యాత పురుషులను అనుకరించడం మూర్ఖత్వం'' అంటాడు యింకొక విద్యార్థి. ''వివిధ రంగాల్లో అత్యున్నత స్థానాన్ని సంపాదించిన వ్యక్తుల్లో ఎవరినో ఒకరిని ఆరాధించడం సర్వసాధారణం. వారిని కేవలం ఆరాధించడమే కాదు, వారి మాదిరి తయారు కావాలనే నా కోరిక'' అంటాడు మరొక విద్యార్థి.

ఒక విద్యార్థి, విశ్వ విఖ్యాత కళాకారుడైన వాల్ట్ డిస్నీని ఆదర్శంగా భావించాడు. ఎందుకంటే ఆ కళాకారుని జీవితంలో జరిగిన ఒక సంఘటన, అది అతనిపై చూపిన ప్రభావాన్ని తెలియపరచాడు. వాల్ట్ డిస్నీ తన ఏడవఏట ఒక చెట్టుపై గుడ్లగూబ నిద్రించడం చూచాడు. దానితో ఆకర్షితుడై దాన్ని పెంచుకొనే వుద్దేశ్యంతో దాని కాళ్లు రెండు పట్టుకుంటాడు. అయితే అది కళ్లు పెద్దవి చేసి భయంకరంగా రెక్కలు కొట్టుకుంటూ అతని పట్టునుండి విడిపోవాలని ప్రయత్నించింది. అయితే ఆ పిల్లవాడు భయంతో దాన్ని యింకా గట్టిగా పట్టుకుని దాన్ని నేలకేసి కొట్టాడు. అది రక్తంకారుతూ విలవిల తన్నుకొని చనిపోయింది. ఆ బాలుడు గట్టిగా ఏడ్చి పశ్చాత్తాపం చెంది జీవితంలో ఏ ప్రాణిని హింసించనని శపథం చేశాడు. ఆ సంఘటన వాల్ట్‌డిస్నీ జీవితాన్నే ప్రభావితం చేసింది. తన కళాఖండాల్లోనూ, చిత్రాల్లోనూ అహింసావాదిగా ప్రసిద్ధి కెక్కాడు. అలాంటి డిస్నీని ఆ విద్యార్థి ఆదర్శంగా భావించానని పేర్కొన్నాడు.

కొందరు గుడ్డిగా ఆరాధిస్తారు. మరికొందరు వారి ఆరాధ్య వ్యక్తుల్లోని బలహీనతలను గుర్తించి తగు మోతాదులోనే వారిని ఆదర్శంగా తీసుకోవాలంటారు. యువతీ, యువకులున్నంత కాలం ఆదర్శ వ్యక్తులకు కొదువలేదు. వారి ఆదర్శాలే యువకుల జీవితాలను శాసిస్తాయి. ముందుకు తీసుకు వెళ్తాయి.

# ఆచార్య నాగార్జున మధ్యమక కారిక
# బుద్ధవందనం

- రాజగోపాల రావు

అనిరోధ । మనుత్పాద । మనుచ్ఛేద । మశాశ్వతమ్
అనేకార్థ । మనానార్థ । మనాగమ । మనిర్గమమ్
యః । ప్రతీత్యసముత్పాదం । ప్రపంచోపశమం । శివమ్
దేశయామాస । సంబుద్ధం । వన్దే । వదతాం । వరమ్

అనిరోధం, అనుత్పాదం, అనుచ్ఛేదం, అశాశ్వతం, అనేకార్థం, అనానార్థం, అనాగమం, అనిర్గమం, అయిన(టువంటిది), ప్రపంచ ఉపశమనకరం శివకరమయిన ప్రతీత్యసముత్పాదాన్ని ఉపదేశించిన దేశికోత్తముడు సంబుద్ధునికి వందనం జేస్తున్నాను.

ఆచార్య నాగర్జునుడు మధ్యమక కారికను ప్రారంభిస్తూ దానికి సూత్రప్రాయమయిన ప్రతీత్య సముత్పాదాన్ని ప్రస్తుతిస్తూ దానిని ఉపదేశించిన బుద్ధునికి ముందుగా వందనాలు చెల్లిస్తున్నాడు. అది ఆనాటి సంప్రదాయమని మనం గ్రహించవచ్చు, ఆచార్యుడు సంప్రదాయబద్ధుడని గూడా అర్థం జేసుకోవచ్చు. నాగార్జునుడు మహాయాన బౌద్ధానికి మూలపురుషు డయినా కాకపోయినా దానికి చెందిన మాధ్యమిక శాఖకు మూలపురుషుడనటంలో సందేహం లేదు. ఆచార్యుని మధ్యమక కారికే మాధ్యమిక శాఖకు మూలగ్రంథం. వ్యావహారిక జ్ఞానమంతా మిథ్యాజ్ఞానమనీ వ్యావహారికంగా యథార్థా లనుకొనేవేవీ స్వభావ సిద్ధాలుకావనీ అవన్నీ నామ లక్షణ వికల్పాల ద్వారా గ్రహించేవనీ అవి స్వప్నంలో అనుభవించే పదార్థాలవంటివేననీ, ఎండమావుల వంటివనీ, కుందేటి కొమ్ముల వంటివనీ, వివరించి - అవి అన్నీ స్వ-భావ శూన్యాలని **'మధ్యమకకారిక'** ద్వారా నిరూపించాడు. అందువల్లనే మాధ్యమికులు శూన్య వాదులయ్యారు. దాని ఆధారంగా నాగార్జునుని సర్వశూన్యవాదిగా ప్రత్యర్థులు చిత్రించారు. ఇంతగా సంప్రదాయబద్ధుడయిన ఆచార్యుడు, వందన సంప్రదాయాన్ని అనుసరించిన ఆచార్యుడు, అంతా శూన్యమంటాడనుకోవటమే అసంబద్ధంగా గోచరిస్తుంది. మహాయానులు సప్తవిధానుత్తర పూజల నంగీకరిస్తారు.[1] వాటిలో మొట్టమొదటిది వందనం. వందనాలర్పించటంతోనే తన గ్రంథానికి ప్రతీత్యసముత్పాదం మూలసూత్రమని సూచిస్తున్నాడు. ఆచార్యుడు ప్రతీత్య సముత్పాదాన్నే బౌద్ధధర్మ ప్రతిపాదికంగా గ్రహించి ప్రజ్ఞాపారమిత సూత్రాల[2] ఆధారంగా దానిని నిర్వచించి బౌద్ధ ధర్మాన్ని ఏకోన్ముఖం గావించటానికి ప్రయత్నించాడు. **'యుక్తి షష్టికా కారిక'**ను ప్రారంభిస్తూ ఇదేవిధంగా - ప్రతీత్యసముత్పాదాన్ని బోధించిన మునీంద్రునికి నమస్కరిస్తున్నానటం[3]; ఇదం ప్రత్యయతా జ్ఞానంద్వారా దృష్టి జాలంనుంచి బయటపడి రాగద్వేషమోహాలంటని అస్పృశ్య నిర్వాణ మందుకోగలమంటూ 'శూన్యతాసప్తతి' ని ముగించటం[4] నాగార్జునుడు ప్రతీత్య సముత్పాదానికిచ్చిన ప్రాధాన్యాన్ని నిరూపిస్తాయి. ప్రతీత్యసముత్పాద విశ్లేషణద్వారా వివరణ ద్వారా ఆచార్యుడు బౌద్ధధర్మ విశిష్టతను ప్రదర్శిస్తాడు. యథార్థతా ప్రతిపాదనంలో బుద్ధుడు అనుసరించిన వాస్తవిక విధానాన్ని సమర్థిస్తూ

బుద్ధుని అనంతరం బౌద్ధ ధర్మంలో అభివృద్ధి చెందిన విపరీత ధోరణుల బండారం బట్టబయలు చేస్తాడు.

ఆనాడు వాద వివాదాలలో అత్యంత ప్రాధాన్యం వహిస్తున్న అనుభవాతీత సమస్యలను అప్రయోజకాలని బుద్ధుడు తిరస్కరించాడు. వాటిని అవ్యాకృతాలన్నాడు.[5] వాటిని గురించి ఏమీ చెప్పటానికీ వీలు లేదని వివరించాడు. మానవు లనుభవిస్తున్న ముఖ్య సమస్యలవైపు దృష్టి సారించాలన్నాడు. బాణా ఘాతానికి గురి అయిన వ్యక్తి వైద్యుని దగ్గిరికొస్తే వెంటనే గాయానికి మందురాసి, కట్టుగట్టి ఆ గాయం మానటానికి దోహదం జేస్తాడా - లేక - ఆ బాణం ఎవరు వేశారు, ఎటువైపు నుంచి వేశారు, దేనితో చేశారు వంటి ప్రశ్నలతో కాలయాపనం జేస్తాడా అని ప్రశ్నించి అత్యవసర సమస్యలవైపు దృష్టి సారించాలని బోధించాడు.

ఆనాడు ఎంతోమంది ఎన్నో రకాల వాదాలను ప్రచారం జేసుకొంటూ తిరుగుతుండేవారు. వారు గ్రహించిందే పరమ యథార్థమని విశ్వసిస్తూ వారు బోధించేదే పరమ సత్యమని ఉపదేశిస్తూ ఇతరుల దృక్పథాలను తిరస్కరిస్తూ వాదవివాదాలు చేస్తూ వారు గందరగోళ పడుతూ అందరినీ గందర గోళ పరుస్తుండేవారు. అటువంటి వారిని 62 మందిని (ద్వాషష్టి దృష్టి గతాని) 'బ్రహ్మజాలసుత్తం' ప్రస్తావిస్తుంది.[6] వారినందరినీ దృష్టి వాదులగానే పరిగణించాడు బుద్ధుడు. వారందరూ ఏదో ఒక దృక్పథాన్ని అనుసరిస్తూ వారి అవగాహననే పరమ ప్రమాణంగా గ్రహిస్తూ వారు సాధించినదే యథార్థంగా భ్రమపడుతుండేవారు. వారెవరూ యథార్థాన్ని గ్రహించలేరని గ్రహించాడు. వాదవివాదాల ద్వారా నిజం నిగ్గు తేల్చటం సాధ్యంగాదని భావించాడు. యథార్థాన్ని యథాతథంగా అందించగల మార్గాన్ని, జ్ఞానాన్ని అన్వేషిస్తూ పర్యటించి, ఏడు సంవత్సరాలు కఠోర తపస్సుచేసి, దాని నిరర్థకతను గ్రహించి ధ్యానమగ్నుడై క్రమక్రమంగా పురోగమిస్తూ వితర్క విచార ప్రీతి సుఖాల నధిగమించి ఏకాగ్ర చిత్తుడయి సమాధి స్థితినందుకొని సమ్యక్ జ్ఞానం సాధించాడు.[7] 'అదే సంబోధి'. ఆ సంబోధినందిన గౌతముడే బుద్ధుడయాడు. తాను గ్రహించిన నూతన మార్గాన్ని, ఆనాడు పరివ్రాజకులు అనుసరిస్తున్న రెండు తీవ్ర మార్గాలకు - 'కామసుఖల్లికానుయోగం,[8] ఆత్మకిలమథానుయోగం'[9] - మధ్యే మార్గంగా బుద్ధుడు అభివర్ణించాడు. తన నూతన మార్గాన్ని నూతన ధర్మాన్ని తొలిసారిగా వారణాసి దగ్గిర రుషి పట్టణంలోని మృగదావనంలో (నేటి సారనాథ్) పంచవర్గ భిక్షుయులకుపదేశించాడు. అదే 'ధర్మచక్ర ప్రవర్తన' సూత్రంగా పిటక సాహిత్యంలో విశిష్టస్థానం పొందింది.[10] అదే బౌద్ధ ధర్మానికి ప్రాతిపదిక అయింది.

బుద్ధుడు బోధించిన ప్రముఖ ధర్మాలుగా లక్షణత్రయం[11] చతురార్యసత్యాలు[12] , అష్టాంగ మార్గం [13] ప్రతీత్యసముత్పాదాలను[14] ధర్మచక్ర ప్రవర్తన సూత్ర మందిస్తుంది. అవన్నీ విడివిడి సిద్ధాంతాలు కావు. యథార్థాన్ని యథాతథంగా అనుభవికం జేసుకొనే ప్రయత్నంలో అనుసరించే ఆచరణాత్మక విధానం, అందుకొన్న సమ్యక్ జ్ఞాన వివరణలే, మిథ్యా జ్ఞాన నిరోధకాలు.

అందరినీ బాధించే ప్రధాన సమస్య దుఃఖంగా బుద్ధుడు గ్రహించాడు. దానిని నివారించవలసిన అవసరాన్ని గుర్తించాడు. ప్రపంచంలో కొందరు సుఖపడుతున్నట్లూ, కొందరు దుఃఖితులవుతున్నట్లూ భావిస్తూ వాటికి పూర్వ జన్మలోని సుకృత, దుష్కృత కర్మలను కారణాలని వివరిస్తూ భవిష్యత్ జన్మలో పొందబోయే సుఖాల కోసం అనుసరించవలసిన కర్మ కాండలను నిర్దేశిస్తూ మానవ ప్రవర్తనను నిరామయం జేశాయి సాంప్రదాయిక దృక్పథాలు. బుద్ధుడు

సర్వమానవ దుఃఖాన్ని సంభావించాడు. జన్మ దుఃఖం, జర దుఃఖం, ప్రియావియోగ దుఃఖం, అప్రియా సంయోగ దుఃఖం - ఈ విధంగా అందరూ అనివార్యంగా దుఃఖం పొందుతున్నారు. దానికి మూలం తృష్ణ, ఆ తృష్ణ అవిద్యవల్ల (అజ్ఞానం వల్ల) అభివృద్ధి చెందుతుంది. ఆ కారణాలను నిరోధించుకోవటం (తొలగించుకోవటం) ద్వారా దుఃఖాన్ని ఎవరికి వారే ఈ జన్మలోనే నిరోధించుకోవచ్చు. ఆ నిరోధమార్గమే అష్టాంగ మార్గం. అదే మధ్యే మార్గం- సమ్యక్ మార్గం. దాని ద్వారా సమ్యక్ సమాధినందుకొని ప్రజ్ఞను పొందవచ్చు. ఒక అనుభవిక వాస్తవాన్ని ఆనుభవిక కారణాల ద్వారా వివరించి అవసరమయిన మార్గాన్ని నిర్దేశించటం బుద్ధుని ప్రత్యేకత. అవే చతురార్య సత్యాలుగా ప్రసిద్ధి చెందాయి - దుఃఖం, దుఃఖ సముదయం, దుఃఖ నిరోధం, దుఃఖ నిరోధ మార్గం.

దుఃఖాన్ని అనివార్యంజేసి దానిని జన్మపరంపరలతో ముడి వేసేవారు శాశ్వతాత్మ మీద ఆధారపడతారు. శరీరం అశాశ్వత మంటారు. ఆ అశాశ్వత శరీరంలోనే శాశ్వతాత్మ ఉంటుందంటారు. శరీరం విచ్ఛిన్నమయిపోయినా ఆత్మ అవిచ్ఛిన్నంగా కొనసాగుతుందంటూ శాశ్వతవాద ప్రతిపాదకులవుతారు. శరీరం విచ్ఛిన్న మయిపోతున్నప్పుడు అందులో మిగిలేదేమీ ఉండదంటారు ఉచ్ఛేదవాదులు. ప్రపంచ పదార్థాలన్నీ ఉత్పత్తి క్షయాలకు లోనవుతాయంటారు కొందరు. దానికి ప్రాతిపదికగా ఆత్మనంగీకరిస్తారు. ఆ ప్రాతిపదిక ఏకమంటారు కొందరు, అనేకమంటారు కొందరు. ఉచ్ఛేదవాదులు తప్ప మిగిలిన వారందరూ ఒక శాశ్వతాంశాన్ని - ఆత్మఅనో, జీవుడనో, ప్రాణమనో- అంగీకరిస్తారు. ఆ విధంగా రెండు తీవ్ర ధోరణులు - శాశ్వత, ఉచ్ఛేదవాదాలు వ్యక్తమవుతాయి.

ఈ రెండు ధోరణులూ వాస్తవాన్ని విస్మరిస్తున్నాయని భావించాడు బుద్ధుడు. వారు ఏదో ఒక మనుష్యుడో ఒక పదార్థమో ఎక్కడో ఒక చోట ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక స్థితిలో ఉంటుందనో - ఉండదనో భావిస్తున్నారు. ఉంటుందంటే (అస్తి) వారనుకొన్న విధంగాఉండటం, లేదంటే (నాస్తి) వారనుకొన్న విధంగా అనుకొన్న చోట అనుకొన్న సమయంలో లేకపోవటం. నిజానికి ప్రపంచంలో ఏవీ అట్లా ఉండటమూ జరగదు, లేకుండా పోవటమూ జరగదు. ప్రపంచంలో ఏదీ స్థిరంగా ఉండదు. అంతా నిరంతరంగా మారిపోతూనూ ఉంటుంది. ఏదీ స్థిరంగా ఉండదు. కొన్ని పదార్థాలు స్థిరంగా ఉంటాయనుకోవటం, అవి శాశ్వతాలో అశాశ్వతాలో అనుకోవటం, అవి కావాలని ఆరాటపడటం, వాటికి బందీలు గావటం - దుఃఖాలు పెంచుకోవటం - ఇదంతా అజ్ఞానం (అవిద్య) వల్లనే. ఈ ప్రపంచం నదీప్రవాహం వంటిది (నదీసోతోలియా). నదిలో నీరు నిరంతరంగా ప్రవహించి పోతూనే ఉంటుంది. అయినా నది స్థిరంగా ఉన్నట్లుగా కనిపిస్తుంది. అట్లాగే ప్రపంచ పదార్థాలన్నీ నిరంతర పరివర్తనకు లోనవుతాయి, నిరంతరంగా సంక్రమిస్తుంటాయి. వాటిని 'ఉన్నవి' అనటానికి వీలులేదు. 'లేవు' అనటానికి వీలు లేదు- 'ఉండి - లేవు' (అస్తి - నాస్తి) అన్నా కుదరదు. ఆ పరివర్తన ఈ పరిమిత అవగాహనకూ అందదు, ఈ పదజాలంతో వర్ణించటమూ సాధ్యం గాదు. ఆ నిరంతర పరివర్తనలో కొన్ని దశలను యథార్థాలుగా గుర్తించటమే పొరపాటు. బాలుడు జన్మించాడంటారు, పెరిగాడంటారు, యువకుడయాడంటారు - వృద్ధుడయాడంటారు - మరణించాడంటారు. అంతటినీ ఉత్పత్తి - స్థితి-భంగాల హద్దులకు పరిమితం జేస్తారు. జన్మించటానికి ముందేమీలేదనుకుంటారు, మరణించిన తరవాతేమీ ఉండదనుకుంటారు. నిజానికి అటువంటి ఆదీ లేదు - అంతమూ

లేదు. అవి ఒకదానినొకటి అనుగమిస్తూ నిరంతరంగా పరివర్తనాత్మకంగా పరిభ్రమిస్తూనే ఉంటాయి. ఏదీ నూతనంగా ఉత్పత్తి కాదు, ఏదీ పూర్తిగా నశించిపోదు. అంతా నిరంతర సంక్రమణమేనంటాడు బుద్ధుడు. అటువంటి అవగాహన రానిదే యథార్థం బోధపడదు. యథార్థంగా భ్రమపడుతుంటారంటాడు. ఆ యథార్థమే పరమార్థం. అది అందరికీ అందదంటాడు. అవసరమయిన విధంగా కృషిచేసి ఆ పరమార్థాన్ని గ్రహించినప్పుడే అంతా అనిత్యమేనని (అశాశ్వతం) గ్రహిస్తారు. అంతా అనాత్మ (శాశ్వతాత్మ లేదని) అని గ్రహిస్తారు. సర్వం దుఃఖం, అనిత్యం, అనాత్మలే లక్షణత్రయం.

ఆ పరమార్థ అవగాహనకు కృషిచేసి దానిని సాధించి, అవిద్యను నిర్మూలించుకోవటానికి, మిథ్యా జ్ఞానం నుంచి బయటపడటానికి అవసరమయిన ప్రేరణ కోసం బుద్ధుడు మాటల కందని ఆనిరంత పరివర్తనను వ్యావహారిక పదాలలో అందించటానికి చేసిన ప్రయత్నమే ప్రతీత్య సముత్పాదంగా వ్యక్తమయిందటాడు నాగార్జునుడు. అందువల్లనే బుద్ధుడు లోకసంవృతి సత్యాన్ని పరమార్థ సత్యాన్ని బోధించి లోకసంవృతి సత్యం ద్వారా పరమార్థ సత్యాన్ని అందించటానికి ప్రయత్నించాడంటాడు.[15] అందువల్ల ప్రతీత్యసముత్పాదాన్ని అందులో వ్యక్తమయే పదాల అర్థం ద్వారానే (వ్యక్తోపదేశం) గ్రహించుకోకుండా ఆ పదాల ద్వారా అందించదలచిన హృదయాన్ని (గుప్తోపదేశం) గ్రహించుకోవాలంటాడు ఆచార్యుడు. అప్పుడే యథార్థం యథాతథంగా ఆవిష్కృతమవుతుందంటాడు.

ప్రపంచ పదార్థాలన్నీ ఏదో ఒకదాని ఆధారంగానే సంభవిస్తుంటాయి. ఆ విధంగానే అన్నీ పరతంత్రాలే అవుతాయి, అయథార్థాలే అవుతాయి. వాటిని యథార్థాలనుకొంటూ వాటిని కార్యకారణాలుగా విభజిస్తూ ఆ కార్య కారణాల సంబంధాన్ని నిరూపించలేక అవస్థలు పడుతూ నానా రకాల దృక్పథాలను పెంచుకోవటమనవసరమని బుద్ధుడు భావించాడు. ఈ నిరంతర పరివర్తనలో ఏ అంశాన్ని పరిశీలించినా అది ఏదో ఒక దాని ఆధారంగా సంభవిస్తున్నట్లే ఉంటుంది. దాని నుంచి మరొకటి సంభవిస్తూనే ఉంటుంది. కార్యకారణ పరిభాషలో వివరిస్తే ప్రతిదీ కారణమూ అవుతుంది, ఫలితమూ అవుతుంది. వాటిమధ్య ఎటువంటి అంతరమూ ఉండదు., ఏదో ఒక సంబంధం ద్వారా వాటిని అనుసంధించవలసిన అవసరమూ ఉండదు. అందువల్ల ప్రతిదీ ప్రత్యయమే, ప్రతిదీ ఉత్పత్తే అటువంటి అవినాభావ సంబంధాన్ని ప్రతీత్య సముత్పాదాల ద్వారా అందించటానికి బుద్ధుడు ప్రయత్నించాడు. 'ప్రతీత్య' అనే పదం ప్రతిదానికీ మూలం ఉంటుందని సూచిస్తుంది. దానితో కలిసి- 'సమ్'- ఉత్పత్తి అయేది ప్రతీత్యసముత్పత్తి. 'ఉత్పత్తి' అనే పదం దాని ఉత్థాన పతనాలను సూచిస్తుంది. ఆ విధంగా ప్రతిదీ ఒక మూలం నుంచి సంభవిస్తుంది. అది మళ్లీ భంగమవుతుంది అనే భావాన్ని ప్రతీత్య సముత్పాద మందిస్తుంది. అంతకంటే తేలికగా ఆ నిరంతర పరివర్తనా ప్రక్రియను అందించే మార్గం కనిపించదు. అందుకే ఆ మాటల మాటున ఉన్న భావాన్ని గ్రహించుకోవాలంటాడు ఆచార్యుడు. అప్పుడు నిరోధమూ ఉండదు, ఉత్పత్తీ ఉండదు, అనేకమూ ఉండదు, అమిథ్యాజ్ఞానమంతా ప్రతీత్య సముత్పాద అవగాహనతో నశించి పోతుందంటాడు నాగార్జునుడు.

## సూచికలు:

1. వందన, పూజన, పాపదేశనా, అనుమోదన, అధ్యేషణ, బోధిచిత్తోత్పాద, పరిణామన - ఏడు విధాల పూజలు.

2. ధ్యాన, శీల, క్షాంతి, వీర్య, ధ్యాన, ప్రజ్ఞలు ఆరు ప్రజ్ఞాపారమితలు. వాటన్నిటిలో ప్రజ్ఞే ప్రధానమంటాయి ప్రజ్ఞాపారమిత సూత్రాలు. అష్ట సాహస్రిక, దశసాహస్రిక, శతసాహస్రిక, వజ్రచ్ఛేదిక - ఆదిగా ప్రజ్ఞాపారమిత సూత్రాలున్నాయి. వాటిలో అతిపురాతనమయిన అష్ట సాహస్రిక ప్రజ్ఞాపారమిత సూత్రాలకు ధాన్యకటకం వద్ద కృష్ణానదీ తీరంలో ఒక మహానాగుని వద్ద నుంచి నాగార్జునుడు అందుకొని బౌద్ధ ధర్మాన్ని వ్యాఖ్యానించాడంటాయి టిబెట్ గ్రంథాలు.
3. నమస్త స్మై। మునీంద్రాయ। ప్రతీత్యోత్పాద। దేశినే। యేణనేన। విధానేన। నిషిద్ధా। వుదయ। వ్యతకా। యుక్తి షష్టికారిక, వందనకారిక
4. ఇదంప్రత్యయ। జ్ఞానాత్। ద్రుష్టిజాల। వినిర్గ
అస్ప్రుష్టం,। యాతి। నిర్వాణం। రాగప్రతిఘమోహః॥ శూన్యతా సప్తతి,। 73.
5. లోకం శాశ్వతమా, అశాశ్వతమా; లోకం అంతమా, అనంతమా; జీవం, శరీరం ఒకటేనా, వేరా; తథాగతుడు మరణానంతరముంటాడా, ఉండడా, ఉండకపోవచ్చా, ఉండిపోకపోవచ్చా - ఇట్లాంటి ప్రశ్నలను గురించి ఏమీ నిశ్చయంగా చెప్పలేం కనక అవ్యాకృతాలన్నాడు బుద్ధుడు - పొట్టపాద సూత్రం.
6. సూత్ర పిటకంలో దీర్ఘనికాయంలో ఉంది.
7. సమాధి అనేపదం పిటకాలకు పూర్వం లేదంటున్నారు శ్రీమతి రైస్ డేవిడ్స్ 'సుఖసుత్త' పీఠికలో - Dialogues of Buddha, Part-I, p. 268
8. శరీర పోషణకు ప్రాధాన్యమివ్వటం కామ సుఖిల్లికానుయోగం.
9. శరీర పోషణమే ముక్తిమార్గంగా గ్రహించటం ఆత్మఖిలమత్తానుయోగం.
10. త్రిపిటకాలలోని ప్రధాన సూత్రాలను కొన్ని మార్పులు చేర్పులతో సంస్కృతీకరించి మహాయానులు గూడా అంగీకరించారు.
11. దుఃఖం, అనిత్యం, అనాత్మ లక్షణత్రయం.
12. దుఃఖం, దుఃఖసముదయం, దుఃఖనిరోధం, దుఃఖనిరోధ మార్గం - చతురార్య సత్యాలు.
13. సమ్యక్‌దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ వచనం, సమ్యక్ ఆజీవనం, సమ్యక్ వ్యాయామం, సమ్యక్ కర్మ, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి - అష్టాంగ మార్గంలోని ఎనిమిది అంగాలు.
14. అవిద్య ప్రత్యయంగా సంస్కారాలు; సంస్కారాల ప్రత్యయంగా విజ్ఞానం; విజ్ఞానం ప్రత్యయంగా నామరూపాలు; నామరూపాలు స్పర్శ ప్రత్యయంగా వేదన; వేదన ప్రత్యయంగా తృష్ణ; తృష్ణ ప్రత్యయంగా జన్మ; జన్మ ప్రత్యయంగా జరామరణ శోక పరిదేహనాలు వగయిరా; మళ్లీ అవి ప్రత్యయంగా అవిద్య ఉత్పత్తి అవుతాయని ప్రతీత్య సముత్పాదం వివరిస్తుంది.
15. ద్వేసత్యే,। సముపాశ్రిత్వా,। బుద్ధానాం। ధర్మ। దేశనా।
లోకసంవృతి। సత్యంచ। సత్యంచ పరమార్థతః॥ మ.కా; 24:8
16. వ్యవహారమనాశ్రిత్య। పరమార్థం। నదేశ్యతే।
పరమార్థ మనాగమ్య। నిర్వాణం। నాధిగమ్యతే॥ మ.కా; 24:10

# వ్యక్తిత్వ వికాసం

(గ్రంథం నుండి)

– సి. నరసింహారావు

గతంలో చేసిన తప్పులను తలచుకొని కుమిలిపోవడం, అలాగే, భవిష్యత్తులో ఏం జరుగనున్నదోనన్న విచారంలో కూరుకుపోవడం ప్రతి ఒక్కరికీ సహజమే! గతంలో జరిగిన సంఘటనలను మననం చేసుకొంటూ, అవి అలా జరుగకుండా వుండవలసిందని, ఆ సంఘటనలవల్లనే తమ జీవితం అంతా నాశనమయిందని, ప్రతి ఒక్కరూ మథనపడిపోతుంటారు. అలాగే, భవిష్యత్తులో, ఏది ఎలా పరిణమిస్తుందోనని, తమ జీవితం మరింతగా దిగజారుతుందేమోనని కూడా, అత్యధిక శాతం మంది భయపడుతుంటారు.

## వర్తమాన కాలాన్ని వృధా చేయవద్దు

గతంలో జరిగిన వాటిని తలచుకొంటూ, ఆగ్రహానికి, నిర్వేదానికి, లోనవుతూ, ఏపనీ చేయలేక పోవడం అలాగే భవిష్యత్తులో జరుగనున్న వాటి గురించి విచారిస్తూ, స్తబ్దంగా కూర్చుండి పోవడం, జరుగుతుంటుంది. గతంలోకిగాని, భవిష్యత్తులోకి గాని, తలదూర్చి వర్తమాన కాలాన్ని వృధా చేసేయడం, మనం అనేక మందిలో గమనించవచ్చు.

గతంలో మనం అనేక పొరపాట్లు చేసి వుండవచ్చు. లేదా మనం చేసిన పనులు పొరపాట్లని, తరువాత గుర్తించి వుండవచ్చు. అలాగే, మీ సన్నిహితుల పట్ల, మీరు, కనపరచవలసినంతటి ప్రేమాభిమానాలను, చూపించి వుండకపోవచ్చు. వీటన్నిటి కారణంగా మీరు అపరాధ భావనకు లోనవుతారు. గతంలోని అనుభవాల నుండి గుణపాఠాలను నేర్చుకోవడం అభిలషణీయమే! కాని ఆ అనుభవాల కారణంగా, ప్రస్తుతం ఏమీ చేయలేని స్తబ్దతకు లోనుకావడం, ఏ పనీ ప్రారంభించలేకపోవడం జరుగవచ్చు. ఇలా స్తంభనకు గురిచేసి, వికాసానికి అడ్డుకట్టలు వేసే అపరాధ భావనకు, ఎవరైనా, అంటిపెట్టుకు వుండడానికి కారణాలేమిటి?

## తలకు అపరాధి భావన తగిలించుకొని మథనపడుతూ కూర్చోవడం చాల తేలిక

ఇలా గతాన్ని గురించి మథనపడి పోతుండడం వలన, ప్రస్తుతం ఏమీ చేయనవసరం లేకుండా పోతుంది. మనమేమిటో నిరూపించుకోవడానికి, ప్రతిభాసంపత్తులను వ్యక్తీకరించుకోవడానికి తగిన ప్రయత్నమేదీ చేయకుండా, గతంలో అలా జరగడం వలన, ఇప్పుడీ పరిస్థితి దాపురించిందని వాపోతూ కూర్చోవచ్చు. ఈ అపరాధ భావన, ప్రస్తుత బాధ్యతల నుండి తప్పించుకు తిరగడానికి, తగిన కారణంగా కనిపిస్తుంది. బాధ్యతనంతటినీ ఇలా గతంపైకి నెట్టివేయడం ద్వారా ఇప్పుడు శ్రమపడవలసిన సవాళ్ళను ఎదుర్కోవలసిన అవసరం వుండదు. గతాన్ని గురించి మథనపడిపోతూ, స్తబ్దంగా కూర్చోవడం, ఇప్పుడు, చొరవతో జీవితాన్ని మార్చుకొనే కృషి సల్పడం కంటే, తేలికైన పని.

ఇలా గతాన్ని తలచుకొని, పశ్చాత్తాపపడుతుండడం వలన, అన్ని పనులు సవ్యంగానే నెరవేరతాయని, వీరు ఎదురుచూస్తుంటారు. అంతేకాదు. ఇలా అపరాధ భావనకు లోనవడం ద్వారా, ఇతరుల సానుభూతి సైతం లభిస్తుంది. ఇతరులు జాలి కనపరచుతారు. తామేదైనా సాధించి ఇతరుల మన్నన, గౌరవం పొందడం కంటే ఇలా వారి సానుభూతిని, జాలినీ పొందడం, వీరికి ఆనందకరంగా తోస్తుంది.

## గతాన్ని ఇప్పుడు మార్చలేము

మీరు సైతం, ఈ అపరాధ భావన కోరల్లో చిక్కుకొనివుంటే తక్షణం ఈ వలయం నుండి

బయటపడాలి. గతంలో జరిగిన వాటిని గురించి, మీరెంతగా మథనపడినా ఆ సంఘటనలు, ఆ పనులు మారబోవు. అవి జరిగిపోయాయి. ఈ అపరాధ భావన గతాన్ని మార్చలేదు. మిమ్మల్ని వున్నతులుగా తీర్చిదిద్దలేదు. గతంలో ఎదురైన చేదు అనుభవాల కారణంగా ఇప్పుడు, మీరు చేయలేకపోతున్న పనులేమిటో, గుర్తుచేసుకోండి. వాటిని మీ నోట్‌బుక్‌లో పొందుపరచండి. వీటిలో ఏదో ఒక అంశాన్ని ఎంచుకొని, ఆ పని చేయడానికి ఉద్యుక్తులుకండి. ఒకతను తన భార్యమాటలు విని, అనవసరంగా తల్లిని నిందిస్తాడు. ఫలితంగా, అతను తీవ్రమైన అపరాధ భావనకు లోనవుతాడు. ఈ అపరాధ భావనవల్ల, తల్లితో సంభాషించలేకపోతాడు. ఆమెతో అదివరకటిలాగా మెలగలేడు. గతంలో జరిగింది ఒక సామాన్యమైన పొరపాటుగా గుర్తించి, అపరాధ భావనను వైదొలగించుకో కలిగితే, అతను తన తల్లితో మామూలుగానే వుండగలిగేవాడు.

అలాగే మీరు ఎంచుకొన్న ప్రవర్తన, ఇతరులు ఇష్టపడకపోవచ్చు. మీ జనకులు గాని, పై అధికారి గాని, చుట్టుప్రక్కలవారుగాని, మీ సహచరులుగాని, మీ ప్రవర్తనను ఆమోదించకపోతే, తప్పుచేశామని, మీరు చింతిల్లనవసరం లేదు. ఇతరులు ఇలా మీతో విభేదించడం సహజమేనని గుర్తించండి. మీరు చేసిన పని, మీకు సవ్యమైనదేనని అనిపించినప్పుడు, మీరు, ఇతరుల ఆమోదం కోసం ఎదురుచూడనవసరం లేదు.

## అపరాధ భావనను అంటిపెట్టుకు వున్నంతటిసేపూ ఏ పనీ చేయలేము

మీరు, గతంలో చేశామని అనుకొనే పొరపాట్లను, చెడ్డపనులను, మీ నోట్‌బుక్‌లో పొందుపరచండి. వాటి కారణంగా ఇప్పుడు మీరు చేయలేకపోతున్న పనులేమిటో కూడా వ్రాయండి. మీరీ పనులు చేయలేకపోవడం వలన, మీకుగాని, మరెవరికిగాని, ప్రయోజనమేదయినా కలుగుతుందేమో ఆలోచించండి. ఒక వ్యక్తి , తన భార్యకు తెలియకుండా మరో యువతితో, అక్రమ సంబంధం ఏర్పరచుకొంటాడు. ఈ కారణంగా, అపరాధ భావనకు లోనవుతూ, తన భార్యకు మరింత దూరమవుతాడు. భార్యతో మనస్సు విప్పి మాట్లాడడానికి, ఆమె పట్ల ప్రేమాభిమానాలను కనపరచడానికి జంకుతుంటాడు. ఇలా, తమను క్రుంగదీసే అపరాధ భావనను వైదొలగించుకోనంతవరకూ, తమ జీవితాన్ని మార్చివేసే ప్రయత్నమేదీ ఇటువంటివారు ప్రారంభించలేరు.

గతాన్ని గురించి మథనపడిపోవడం ఎంతటి హానికరమో, అలాగే, భవిష్యత్తును గురించి వ్యాకులపడడం కూడా, అంతే హానికరం. ఇప్పటినుండి, మీరు, జీవితకాలమంతా, ఏది ఎలా జరుగనున్నదోనని విచారిస్తూ గడుపవచ్చు. కాని ఈ విచారం మీ జీవితాన్ని ఇంకా దిగజార్చుతుందే తప్ప, ఏమీ మార్చలేదు. భవిష్యత్తులో ఏమిచేయాలన్న ప్రణాళికలను రూపొందించుకోవడం వేరు, ఏమి జరుగనున్నదోనని విచారిస్తూ, స్తబ్దంగా, కూర్చోవడం వేరు.

పిల్లలు బజారుకు వెళితే, వాళ్లు సవ్యంగా తిరిగి వస్తారో రారోనని, చాల మంది తల్లితండ్రులు, అనవసరంగా వ్యాకులతకు లోనవుతుంటారు. అలాగే పరీక్షలు వ్రాసిన విద్యార్థి, ఫలితాలెలావుంటాయోనని, తాను ఉత్తీర్ణుడవుతానో లేదోనని, విచారిస్తూ కూర్చుంటాడు. అలాగే, ప్రయాణం పెట్టుకున్న వ్యక్తి, తన కుటుంబ సభ్యులందరికీ రైల్లో టిక్కెట్లు దొరుకుతాయో లేదోనని, తీరా తాము వెళ్లినచోట హోటళ్లలో ఖాళీ వుంటుందో లేదోనని, మథనపడిపోతుంటారు. ఇలా ఏం జరుగనున్నదోనని విచారిస్తూ కూర్చోవడం వలన, ప్రస్తుతం ఏ పనినీ వీరు, సమర్థవంతంగా, సవ్యంగా, నిర్వహించలేరు. పైగా ఇలా విచారించే విషయాలలో అధికశాతం, మనంచేయకలిగినవే అయి వుంటాయి. తమకుగాని, పిల్లలకుగాని, ఆరోగ్యం ఎలా వుండబోతుందోనని, ధరలు ఎలా పెరుగుతాయోనని, తమ జీతం పెరుగుతుందో లేదోనని అలాగే ఇటువంటి అనేక అంశాలను గురించి చాలమంది

మథనపడిపోతుంటారు. తాము ఉపద్రవంగా భావించే అంశాన్ని నిజంగా ఎదుర్కోవలసివచ్చినప్పుడు, అది తాము ఊహించినంతటి భయంకరంగా వుండదు.

మీరు, ఏయే అంశాల గురించి మథనపడిపోతుంటారో, మీ నోట్‌బుక్‌లో వ్రాసుకోండి. మీరెందుకు విచారిస్తుంటారు? మీ పిల్లల ఆరోగ్యం గురించి, వారి భవిష్యత్తు గురించి, విచారిస్తూ కూర్చుంటారా? లేక మీ ఆరోగ్యం గురించా? మీ ఉద్యోగం గురించా? లేక మీ వ్యాపారం గురించా? గుండెపోటుగాని, క్యాన్సరుగాని రావచ్చునుకొంటున్నారా? దాంపత్య జీవితం ఎలా వుంటుందోనని విచారిస్తున్నారా? సరైన నిర్ణయం గైకొని ఏ పనినైనా, సవ్యంగా చేయగలుగుతామా లేదా అని మథనపడుతున్నారా? మీకు ఆరోగ్యవంతమైన పిల్లలు పుడతారా లేదా అని దిగులు పడుతున్నారా? ఏదైనా ప్రమాదంలో చిక్కుకుంటారేమోనని భయపడుతున్నారా? మీ స్నేహితులు మిమ్మల్ని అపార్థం చేసుకుంటారేమోనని, మీకు దూరంగా తొలగిపోతారేమోనని చింతిస్తున్నారా? వృద్ధాప్యం ఆవహిస్తున్నదని విచారిస్తున్నారా?

## భవిష్యత్తును గురించి మథనపడడం మిమ్మల్ని అచేతనుల్ని చేస్తుంది

ఇలా, నిరంతరం ఏదో ఒక విషయం గురించి చింతిస్తూ కూర్చునే వ్యక్తులు, మనకు ప్రతిచోటా తారసిల్లుతుంటారు. భవిష్యత్తులో ఏది ఎలా పరిణమిస్తుందోనని విచారిస్తూ కూర్చోవడం ద్వారా, ప్రస్తుతం ఎదురయ్యే సమస్యల న్నుండి, సవాళ్ళ నుండి పలాయనం చిత్తగించవచ్చు. చికాకుగా, వ్యాకులతతో నిండి వుండడం వలన, మనస్సును ఏపనిపైనా లగ్నం చేయలేక పోతున్నామని వీరు, తమకు తాము సంజాయిషీ చెప్పుకొంటుంటారు. అలాగే తమ సన్నిహితుల గురించో, తమ పిల్లల గురించో, జీవిత సహచరుల గురించో, నిరంతరం మథనపడిపోతుండడం, వారి పట్ల తమకుగల ప్రేమకు చిహ్నమని వీరు భావిస్తుంటారు. అలాగే తమ ఆరోగ్యం పాడయిపోతున్నదని చింతిస్తున్న వ్యక్తులు, సరైన ఆహారం తీసుకోకుండా, వేళకు నిద్రపోకుండా, నిజంగా, తమ ఆరోగ్యాన్ని చెడగొట్టు కుంటుంటారు. నిరంతరం చింతిస్తూ కూర్చునే వ్యక్తులు, తమను తాము మార్చుకోవడానికి, ఏమీ ప్రయత్నించరు. తమను ఇబ్బందికి లోను చేసే విషయాల గురించి మథనపడి పోతుంటారే తప్ప వాటిని సరిదిద్దడానికేమీ చేయరు. ఏ పనినైనా ప్రారంభించడం కంటే, కష్టపడి పూర్తిచేయడం కంటే, ఇలా విచారిస్తూ కూర్చోవడమే, ఎవరికైనా, సులభంగా వుంటుంది. అంతేకాదు. ఎప్పుడూ ఇలా విచారిస్తూ కూర్చోవడం వలన తలనొప్పి, అల్సర్లు, రక్తపుపోటు మొదలైన అనారోగ్య చిహ్నాలు సంప్రాప్తించవచ్చు. ఫలితంగా ఇతరుల సానుభూతి లభిస్తుంది. తామేమీ చేయకుండా అనారోగ్యంతో కూర్చోగల అవకాశమూ లభిస్తుంది.

మీరు భవిష్యత్తును గురించి మథనపడిపోయేకంటే, వర్తమాన క్షణాలను ఎలా సద్వినియోగం చేసుకోవాలా అని ఆలోచించండి. అలాగే, మథనపడడం మీరు ప్రారంభించిన క్షణాన్నే, ఏ పని నుండి తప్పించుకోజూస్తున్నారో, ఆలోచించండి. వెంటనే ఆ అంశాన్ని మీ నోట్‌బుక్‌లో గుర్తు చేయండి. మీరిలా చింతిస్తూ కూర్చోవడం వలన, ఏ మార్పయినా సంభవిస్తుందా అని, మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి. అలాగే, మీరు, ఏయే అంశాల గురించి అధికంగా చింతిస్తూ కూర్చుంటారో, మీ నోట్‌బుక్‌లో గుర్తించండి. ప్రతిరోజూ ఒక నిర్ణీత సమయంలో, కేవలం ఒక్క అరగంటసేపు మాత్రమే, వీటిని గురించి మథనపడాలని నిర్ణయించుకోండి. తరువాత, అలాగే, గతనెలరోజుల నుండి, మీరు మథనపడుతున్న అంశాలేమిటో, మీ నోట్‌బుక్‌లో గుర్తుచేయండి. మీరు మథనపడిన వాటిలో, ఏమయినా నిజరూపం దాల్చాయేమో, ఆలోచించండి. మీరు ఎంతగానో భయపడి, విచారిస్తూ కూర్చున్న అంశం, చాలా అప్రధానమైనదిగా కూడా రూపొందవచ్చు.

మీరు ఎదురైన సమస్యను, నేరుగా ఎదుర్కోవడానికే ప్రయత్నించాలే తప్ప, దాన్ని గురించి విచారిస్తూ, సమయాన్నంతటినీ వృధాచేయడం భావ్యం కాదు.

మీరెప్పుడైనా తీవ్ర ఆగ్రహానికి లోనవుతుంటారా? ఇలా ఆగ్రహానికి లోనవ్వడం చాల సహజమనుకొంటారా? కాని ఈ ఆగ్రహం వలన ఎటువంటి ప్రయోజనమూ చేకూరదు. అంతేకాదు ఎవరికైనా, ఇలా ఆగ్రహానికి లోనవ్వడం, ఆహ్లాదకరం కాదు.

## ఆగ్రహానికి లోనుకాకపోవడమే ఆరోగ్యకరం

అలా ఆగ్రహానికి లోనయినప్పుడు మీరు ఏపనీ చేయలేరు. ఏమీ ఆలోచించలేరు. పైగా ఇది క్రోధంగా, తీవ్రమైన ఆవేశంగా రూపొంది, సభ్యతాసభ్యతలను మరచి, ఎదుటివారిపై విరుచుకు పడేలా చేస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆగ్రహం మిమ్మల్ని స్తంభీభూతులను చేస్తుంది. చాలామంది తీవ్రమైన నిస్పృహకు లోనయినప్పుడు, ఆగ్రహావేశులు కావడం, అలవాటు చేసుకొంటారు. ఆగ్రహానికి లోనయినప్పుడు, మిమ్మల్ని మీరు, సవ్యంగా వ్యక్తం చేసుకోలేరు. మీ ఆలోచనలన్నీ స్తంభించిపోతాయి. అంతేకాదు. మీకు, ఇతరులతో ఎంతోకాలంనుండీ పెనవేసుకొన్న అనుబంధాన్ని సైతం, ఇది దెబ్బతీస్తుంది. ఆగ్రహాన్ని మనస్సులో అణచుకోవడం కంటే పైకి వ్యక్తం చేయడమే ఆరోగ్యకరం కావచ్చు. కానీ, అసలు ఆగ్రహానికి లోను కాకపోవడమే ఆరోగ్యకరమని వేరే చెప్పనవసరం లేదు.

ఆగ్రహం దానంతట అది మిమ్మల్ని ఆవహించదు. కేవలం మీ ఆలోచనా ధోరణితో, మీరు, ఆగ్రహాన్ని కొనితెచ్చుకొంటారు. పరిస్థితులు, మీరు అభిలషించిన రీతిలో రూపుదాల్చకపోతే, ఆగ్రహానికి లోనవుతుంటారు. మీరు, తీవ్రమైన నిస్పృహకు లోనైనప్పుడు దాన్నుండి ఎలా బయటపడాలా అని ఆలోచించండి. ఈ ప్రపంచమంతా మీరు కోరుకొన్న రీతిలో వుండకపోవచ్చు. అందుకని మీరు ఆగ్రహానికి లోనవడం వలన ఎటువంటి ప్రయోజనమూ వుండదు.

## మనల్ని ఆగ్రహానికి లోనుచేసే వ్యక్తులు
## మనల్ని పరోక్షంగా శిక్షిస్తుంటారు

పిల్లలు అల్లరి చేస్తుంటే, వారిని సవ్యమైన మార్గంలో పెట్టడం ఎలాగో తెలియని తల్లిదండ్రులు, తీవ్రమైన ఆగ్రహానికి లోనవుతారు. పెద్దగా అరుస్తారు. పెడబొబ్బలు పెడతారు. పిల్లల్ని కొడతారు. ఆ పిల్లల పనులు చూస్తూ వీరు ఒకగంటలో అలసిపోతారు. తమ తల్లిదండ్రులను, ఆగ్రహానికి లోనుచేసి వినోదించడమెలాగో, పిల్లలు నేర్చుకొంటారు. ఆగ్రహంతో, ఎదుటి వ్యక్తులను మార్చలేము. పైగా మనల్ని ఆడించడమెలాగో ఎదుటివారికి నేర్పుతాము. ఆగ్రహంతో మండిపోవడంకంటే మానసికహింస మరొకటి వుండదు. ఎదుటి వారిపై ఆగ్రహాన్ని ప్రదర్శించి దూషించి వారిని శిక్షించబోతున్నామనుకొంటాం. కాని ఎదుటివారు మాత్రం మనల్ని ఆగ్రహానికి లోనుచేసి మన మనస్సును స్తంభీభూతం చేసి మనల్ని శిక్షిస్తున్నామనుకొంటారు.

తీవ్రమైన ఆగ్రహానికి లోనయినప్పుడు, ఆ ఆగ్రహాన్ని పైకి వ్యక్తం చేసినా, చేయకపోయినా ఫలితం ఒక్కటే! ఆగ్రహానికి లోనయిన వ్యక్తి, తీవ్రమైన మనోవేదనకు లోనవ్వడం జరుగుతుంది. ఇలా మీరు చీటికీ మాటికీ ఆగ్రహానికి లోనవుతుంటే, ఇలా ఆగ్రహానికి లోనవుతున్న ప్రతి సందర్భంలోను, ఇదెంతవరకూ సవ్యమైనదో ఆలోచించాలి. ఎదుటి వ్యక్తి, తెలివి తక్కువగా ప్రవర్తించి, మిమ్మల్ని తల్లడిల్లింప జేయడానికి ప్రయత్నిస్తున్నప్పుడు, అతను కోరుతున్న రీతిలో, మీరు తల్లడిల్లిపోవడం సబబా? మీకు ఆగ్రహం కలిగించి, మిమ్మల్ని తల్లడిల్లింపచేయగల అధికారం, ఈ ప్రపంచంలో మరెవ్వరికీ లేదు. ఈ అవకాశం ఎవ్వరికీ, మీ అంతట మీరు కల్పించవద్దు. అందుకే మీకు నచ్చని ప్రవర్తనను చూసి మీరు తల్లడిల్లనవసరం లేదు.

మీరు బస్సులోకాని, స్కూటరుమీద కాని వెళుతున్నప్పుడు, ఇతరులు ఏ నిబంధనలు పాటించకుండా వెళుతుంటే, మీకు వారిపై తీవ్రమైన ఆగ్రహం కలుగవచ్చు. అలాగే ఆటల్లో మీతోపాటు పాల్గొన్నవారు, సరిగ్గా ఆడలేకపోయినా, నిబంధనలను అతిక్రమించినా, మీకు ఆగ్రహం కలుగవచ్చు. అలాగే, ఇతరులు చెప్పిన వేళకు రాకపోయినా, చేస్తానన్న పని చేయకపోయినా, మీరు ఆగ్రహానికి లోనుకావచ్చు. అలాగే మీకు సవ్యంగా పని చేయని వస్తువులపై ఆగ్రహం కలుగవచ్చు. సమయానికి రేడియో పనిచేయకపోయినా, టెలిఫోన్ చెడిపోయినా, మీరు వాటిని విసిరికొట్టవచ్చు. అలాగే, సరైనసమయంలో తాళం చేతులు, పర్సు వంటి వస్తువులు కన్పించకపోతే, మీరు తీవ్రమైన ఆగ్రహానికి లోను కావచ్చు. ఇలా ఆగ్రహానికి లోనవ్వడం వలన, ఈ సంఘటనలేవీ మారబోవు. మనకు రుచించని అంశాన్ని మార్చుకోవడానికి ప్రయత్నించకుండా, ఆగ్రహానికి లోనుకావడం వలన ప్రయోజనమేదీ వుండబోదు.

## ఆగ్రహానికి లోనుకాకుండా మిమ్మల్ని మీరు కాపాడుకోవచ్చు

మీరు ప్రయత్నించితే, ఈ ఆగ్రహాన్ని పూర్తిగా అధిగమించవచ్చు. అయితే, ఇందుకై మీరు, నూతన ఆలోచనా ధోరణిని అలవరచుకోవాలి. ముందుగా, మీకు ఏయే వ్యక్తులవద్ద, ఏయే సందర్భాలలో ఆగ్రహం కలుగుతుంటుందో మీనోట్‌బుక్‌లో వ్రాసుకోండి. ఇక ఇప్పుడు ఏ సందర్భంలోనయినా, మీరు ఆగ్రహాన్ని వ్యక్తం చేయకుండా వుండడం, సాధ్యపడుతుందేమో ఆలోచించండి.

మీకు తీవ్రమైన ఆగ్రహం కలిగినప్పుడు, దాన్ని వ్యక్తం చెయ్యడాన్ని, ఒక్క నిముషంపాటు వాయిదావేయండి. మీరు గతంలో ఆలోచించిన రీతిలో ఆలోచించనవసరంలేదని, నూతన దృక్పథాన్ని అలవరచుకోవచ్చని, గుర్తించండి. అలాగే మీరు, ఆగ్రహాన్ని వ్యక్తం చేయడాన్ని వాయిదా వేయడం నేర్చుకోగలిగితే, దాన్ని అదుపుచేయడం కూడా క్రమంగా అలవడుతుంది.

అలాగే మీ పిల్లల దగ్గరగాని, మరెవరిదగ్గర గాని కోపం వచ్చినట్లు నటించండి. హెచ్చు స్వరంతో, మీరు చెప్పదలచుకొన్నది స్పష్టంగా చెప్పండి. కఠినంగా కనిపించండి. ఇలా కోపాన్ని కనపరచినప్పుడు, మీరు మనోవేదనకు లోనుకావడం జరగదు. మీరు దేన్నయినా ఇష్టపడవచ్చు. లేదా అయిష్టతను కనపర్చవచ్చు. కాని అయిష్టతను కనపరచే అంశం పట్ల, మీరు ఆగ్రహం చెందాల్సిన అవసరం లేదు. ప్రతి ఒక్కరూ తమకు తోచిన రీతిలో ప్రవర్తిస్తుంటారు. వారు మీరు కోరినవిధంగా మారడంలేదని, మీరు ఆగ్రహావేశులు కానవసరం లేదు. మీరు భిన్నంగా వుండడానికి ఎంతటి అవకాశంవుందో, వారు భిన్నంగా వుండడానికి కూడా, అంతే అవకాశం వుందని గుర్తించాలి.

మీరు తీవ్రమైన ఆగ్రహానికి లోనయి, ఎదుటివారిపై విరుచుకు పడిన తరువాత, మీరు, అనవసరంగా ఆగ్రహానికి లోనయ్యామని అంగీకరించండి. అలాగే, అసందర్భంగా మాట్లాడినట్లు ఒప్పుకోండి. ఇలా చెప్పగలిగినప్పుడు, మీకు కలిగే ఆగ్రహాన్ని, క్రమంగా అదుపుచేయగలుగుతారు. అలాగే, మీరు సన్నిహితులపై ఆగ్రహాన్ని ప్రదర్శించాలనుకొనే సందర్భంలో, మీకెంత ఇష్టం లేకపోయినా, ఎదుటివారి చేతులు పట్టుకోండి. వారి కళ్ళలోకి సూటిగా చూడండి. ఇలా, మీలో ఆగ్రహం ఇంకిపోయేవరకూ, వారి చేతులు పట్టుకోగలిగితే, మీరు క్రమంగా, ఈ ఆగ్రహాన్ని అదుపు చేసుకోగలుగుతారు. అలాగే మీరు తీవ్రమైన ఆగ్రహాన్ని కనబరచబోయినప్పుడు మాటలతో విరుచుకుపడకుండా, ఓ కాగితంపై మీ మనోభావాలను వ్రాసి, తిరిగి దాన్ని ఓసారి చదువుకొని ఎదుటివారికి అందించండి.

అలాగే ఆగ్రహం కలిగిన ప్రతి సందర్భంలోను, మీరు, ఎంతటి నిస్సహాయులుగా, ఎంతటి

దయనీయంగా రూపొందుతారో గుర్తించి, ముందుగా, ఆ భావాలను, పైకి వ్యక్తం చేయండి. మీరు చెప్పిన పనిని, ఎదుటి వ్యక్తి చేయనప్పుడు, దాని వలన ఎంతటి నష్టం సంభవిస్తుందో, ఎంత చెడ్డపేరు వస్తుందో, ముందుగా వివరించి చెప్పండి. ఆ పని ఎంతటి ప్రధానమైనదో స్పష్టం చేయండి. తరువాత, మీరు ఆగ్రహానికి లోనుకావలసిన అవసరమే వుండబోదు. ఆగ్రహం కలిగినప్పుడు, ఓ పది సెకన్లపాటు దాన్ని వాయిదా వేయగలిగితే చాలు.

మీరు చెప్పే విషయాలను, దాదాపు సగంమంది తిరస్కరించవచ్చని గుర్తించండి. ఎదుటివారు ఏకీభవించనంతటి మాత్రాన, మీరు ఆగ్రహం చెందనవసరం లేదు. ఆగ్రహం జనించినప్పుడు, దాన్ని వ్యక్తం చేయకుండా మీలోనే అణచుకోవడం, ఆ తరువాత, క్రమంగా ఆగ్రహమే జనించకుండా జాగ్రత్తపడడం, అలవరచుకోవాలని గుర్తించండి. ఏయే అంశాలకు సంబంధించి, ఆగ్రహాన్ని అదుపు చేసుకోగలరో, ఏయే సందర్భాలలో ఆగ్రహమే కలుగకుండా జాగ్రత్తపడగలరో, మీ నోట్‌బుక్‌లో వ్రాసుకోండి.

మీరు తోటివారి నుండి ఎక్కువగా ఆశించవద్దు. ఇలా ఎక్కువగా ఆశించి, వారవి సాధిస్తారని ఎదురు చూస్తున్నప్పుడు, వారు మీ ఆశలకు అనుగుణంగా ప్రవర్తించలేకపోతే, మీరు ఆగ్రహం చెందుతారు. అసలు ఏమీ ఆశించకపోయినప్పుడు, మీరు ఆగ్రహానికి లోనయ్యే అవకాశమే వుండదు. మీరు, చుట్టూ వున్న వ్యక్తులను గమనిస్తున్నప్పుడు, వారు ఏయే సందర్భాలలో ఆగ్రహానికి లోనవుతుంటారో గుర్తించండి. మీరు, ఈ వారంలో, ఏయే సందర్భాలలో ఆగ్రహానికి లోనుకావలసినా, కోపం తెచ్చుకోలేదో నోట్‌బుక్‌లో వ్రాయండి.

## Steps to Stress - proof your body

### Learn to relax your mind

Slumping down in front of the TV set won't necessarily relax your mind. The day's problems and worries may still be rushing through your mind. To relax properly you need to learn to day - dream. You have to allow your imagination to dominate your thinking and to take over your body. Find somewhere comfortable. Lock the door, lie dwon and make yourself comfortable. Take big, deep breaths and try to conjure up some particularly restful scene from your past. Imagine that you are on a beach, for example. Try to feel the warm sand on your back and the warm sun on your face. Hear the waves crashing on the shore in the distance. And listen to the seagulls high overhead. Gradually your body will respond to reality but to imagined reality. And your mind and body will truly relax. Once you have learned how to "day - dream" properly you'll be able to use this trick wherever you are - even on a busy train or in a crowded store.

# నీ కొడుకు - నీ కూతురు

(గతసంచిక తరువాయి) - ఆర్. వి. జి. సుందరరావు.

నీ శిశువు యొక్క లింగం సంయోగమైన తక్షణం నిర్ణయమైపోయిన సంగతి తెలుసుకున్నావు. అది నిజమే కాని, దానితోపాటు లింగనిర్ణయం గురించి మరికొన్ని ముఖ్యవిషయాలు కూడా తెలుసు కోవాలి. అసలు లింగనిర్ణయంలో అది ప్రథమసోపానం అంతతో ఊరుకుంటే సినీమా చూడ్డానికి వెళ్ళి తెరమీద డైరెక్టరు పేరూ, ఛాయాగ్రహకుడి పేరూ, తారాగణం తెలుసుకున్న వెంటనే, నిద్రపోయినట్టవుతుంది.

చెప్పాలిసొసే సంయోగకాలంలో స్త్రీ పురుష బీజాల్లోని x,y క్రోమోజోములు మీ శిశువుకి స్త్రీత్వమో, పురుషత్వమో ప్రసాదిస్తయి. కాని ఆవరంపొందిన అండం స్త్రీగానో, పురుషుడుగానో మారాలంటే ఇంకా అనేక కార్యాలు జయవంతంగా జరగాలి. ఆ కార్యాలు ఫలప్రదంగా జరగనపుడు కొన్ని వైపరీత్యాలూ, మనం అప్పుడపుడు చూస్తూండే ఆడవారిలాంటి మగవాళ్ళూ, మగవాళ్ళలాంటి స్త్రీలూ సంభవిస్తారు. స్త్రీ పురుషత్వాలు పరిపూర్ణంగా ఏర్పడాలంటే, సంయోగమైన కొద్దిరోజులకే పిండంలో ఏ కెమికలు ఫ్యాక్టరీలోనూ జరగనంత విశిష్టమైన రసాయన పద్ధతులు ప్రారంభించి క్రోమోజోము లిచ్చిన లింగాన్ని సిద్ధింపజేస్తాయి. వాటిగురించి తెలుసు కోవడం ఎంతో అవసరం.

మరో విచిత్రం పిండావస్థలో కొన్ని వారాలవరకూ, నీ కొడుకో, కూతురో, వారిని చూచి ఏమో పోల్చుకోలేవు. ఆస్థితిలోని పిండం స్త్రీ అవుతుందా, పురుషుడవుతుందా అంటే మనం చూసి చెప్పలేము. పుర షత్వాని కుండవలసిన వీర్యాశయాలూ (Testes), పురుషాంగమూ, స్త్రీ కుండవలసిన అండాశయాలూ (Ovaries), స్త్రీ అంగమూ యివేమీ మనం పోల్చుకోదగిన స్థితిలో ఉండవు. అయితే నువ్వు ఒక దురభిప్రాయం పడవచ్చును. కొద్దికాలంవరకూ లింగమేమీ లేకుండా పెరిగి, తరవాత లింగచిహ్నాలు ఏర్పడతాయనుకోవచ్చు. అదేమీకాదు పైగా నీవు ఆశ్చర్యపడే రహస్యం ఆ స్థితిలో నీ శిశువుకి స్త్రీకీ పురుషుడుకీ ఉండవలసిన రెండు చిహ్నాలూ సమానంగా ఉంటాయి!! అంటే, ఆ స్థితిలో నీ శిశువు నిజమైన స్త్రీ పురుషుడన్న మాట!! మొట్ట మొదట తయారయే లింగ యంత్రాంగమంతా ఒక జత గ్రంధి (Gonads) విశేషాలు. ఇవే స్త్రీలో అండశయాలుగానూ, పురుషుడిలో వీర్యకోశాలుగానూ మారుతాయి. మిగిలిన లింగ చిహ్నాలు ఆ శిశువుకి రెండు రకాలూ ఉంటాయి. ఉదాహరణగా ఆ శిశువుకి భావిసూచకాలైన స్త్రీ పురుషాంగాలు రెండూ సూక్ష్మదశలో ఉంటాయి! క్రోమోజోము నిర్మాణంవల్ల కొంతకాలం పోయిన తర్వాత ఆ రెంటిలోనూ ఏదో ఒకటి పెద్దదయి రెండోది వెనకబడి పోతుంది. అది ఎట్లా జరిగేదీ, అందులోని విశేషాలూ, యిప్పుడు నేర్చుకుందాం ఈ విషయాలు తెలుసుకున్న తరువాత మనలో ఉన్న అశాస్త్రీయ అభిప్రాయాలు కొన్ని మార్చుకోవలసి వస్తుంది. ముఖ్యంగా, పెరిగి పెద్దయిన తరువాత కూడా ఎవడూ నూటికి నూరుపాళ్లు మగవాడుకాని, ఏ స్త్రీకూడా 100కి నూరు పాళ్ళు స్త్రీఅనిగాని చెప్పుకొనేందుకు వీల్లేదు!! మనం పెరిగి పెద్దయిన తరవాత కూడా, మగవాడిలో పిండావస్థలో ఉద్భవించి తరువాత

శిథిలమైన స్త్రీ చిహ్నాలుంటాయి. ఉదాహరణగా: పురుషుని వీర్యకోశాలవెనక స్త్రీ అంగ చిహ్నముంటుంది. పురుషుని చను మొనలు కూడా స్త్రీచిహ్నాలే!! స్త్రీలో అవి యుక్తవయస్సు రాగానే పెద్దవై, పాలిండ్లుగా, పురుషజాతి నాకర్షించే అంగాలుగా మారుతాయి. దీనికి కారణం : స్త్రీయుక్త వయస్సు వచ్చేప్పటికి వొక గ్రంధి (gland) పనిచేసి ఒక రసాయనాన్ని రక్తంలోనికి పంపుతుంది. తత్ఫలితంగా అంతవరకూ పురుషుడికిమల్లే అణగి ఉన్న అంగాలు ఒక్కమారు మేలుకొని, ఉబికి, విజృంభించి తమ స్త్రీత్వాన్ని నిరూపించుకుంటాయి. ఇటువంటి గ్రంధులను నాళరహిత గ్రంధులంటారు (Ductless glands) . స్త్రీ పురుషులిద్దరిలోనూ ప్రత్యేకమైన గ్రంధు లిట్లాంటివి అనేకం ఉంటాయి ఇవి తయారుచేసే రసాయనాలని ''హార్మోను'' లంటారు. ఇవి దేహంలో స్వల్పంగా తయారైనా వీటి ప్రభావం మాత్రం అమోఘం. ఉదాహరణగా పై హార్మోనుని పురుషునికికూడా యిచ్చినట్టయితే స్త్రీకిమల్లేపాలిండ్లు పెరుగుతాయి!! ఈవిధంగానే స్త్రీలోకూడా పిండావస్థనాటి పురుష చిహ్నాలుంటాయి. ఉదాహరణగా స్త్రీ 'అంగ' నిర్మాణంలో పైభాగంలో చిన్నరూపంలో ఉన్న పురుషాంగచిహ్నం (clitoris) ఉంటుంది.

ప్రస్తుతం తిరిగీ పిండావస్థలో ఉన్న నీ శిశువు వద్దకు పోదాం. ఆస్థితిలో నీ శిశువు నిజమైన స్త్రీ పురుష వ్యవస్థ కలిగి ఉంటుంది. ఆ వ్యవస్థలో ప్రత్యేకలింగానికి చెందిన భాగాన్నే వృద్ధిపొందించే యంత్రాంగం రసాయనికమైనది. ఈ రసాయనాలనే లింగహార్మోను లంటారు.

ఇవి పురుషునిలో వీర్యకోశంలోనూ, స్త్రీలో అండాశయంలోనూ తయారయి రక్తంలోనికి విడువబడతాయి. పురుష పిండంలోని వీర్యకోశహార్మోను రక్తంలో కలవడంతోనే పురుష చిహ్నాలన్నీ వృద్ధిపొందడం మొదలయి, స్త్రీ చిహ్నాలు వెనకబడి శిథిల మౌతాయి. అలాగే స్త్రీలో అండకోశ హార్మోనువల్ల స్త్రీ అంగాలు వికసించి పురుష చిహ్నాలు శిథిలమవుతాయి. ఈ హార్మోనుల ప్రభావం తెలుసుకోవడాని కనేక మంది శాస్త్రజ్ఞులు రకరకాల ప్రయోగాలు చేసి అనేక జీవరహస్యాలని తెలుసుకున్నారు.

ఈ హార్మోనులు లేకపోయినా, సరిగా పనిచెయ్యకపోయినా, దేహంలోనూ, మానసిక తత్వంలోనూ, లింగ ప్రవర్తనలోనూ విపరీతాలు సంభవిస్తాయి. వీర్యకోశాలని చిన్నప్పుడే నాశనం చెయ్యడంవల్ల తయారయే ఎద్దుకీ, అవి పూర్ణంగా పెరిగిన ఆంబోతుకీ ఉన్న భేదం ప్రతివారికీ తెలుసును. ఎద్దుకంటే ఆబోతు చాలా పురుష వంతంగా ఉండి లింగ కార్యాలని నెరవేర్చ కలుగుతుంది. ఎద్దు చాలా సాధువుగానూ, దాని కొమ్ములు చిన్నవిగానూ ఉంటాయి. చిన్నప్పుడే వీర్యకోశాలని తీసివేసిన కోడిపుంజు కూడా అలాగే ఉంటుంది. అది ఎప్పుడూ పుంజులా కూయటంగాని, పెట్టలని వెన్నంటడంగాని చెయ్యకుండా లింగరీత్యా స్త్రీత్వానికి దగ్గరగా ఉంటుంది.

మరో విషయం కూడా కొన్ని ప్రయోగాలవల్ల తేలింది. కోడిపుంజు వీర్యకోశాలని తీసి పెట్ట దేహంలోనికి శాస్త్రీయంగా అతికినట్టయితే అది పుంజు సైజుకి పెరిగి పెట్టలని వెన్నంటడం, మొదలయిన పుంజు కార్యాలని నెరవేరుస్తుంది. ఈ అతకబడిన వీర్యకోశాల్లోని రసాయనాలు దాని రక్తంలో ప్రవహించడం వల్లనే ఈ విపరీత మార్పు కలిగిందన్న మాట!!

''స్టయినాష్'' అన్న శాస్త్రజ్ఞుడు యింకా విశిష్టమైన ప్రయోగాలు చేశాడు. అతడు, పుట్టిన

వెంటనే మొగ పందిపిల్ల నొకదానిని తీసుకుని, దాని వీర్యకోశాలని శస్త్రం చేసేశాడు. ఫలితంగా అది పెరగటంలో బాహ్యచిహ్నాలన్నీ మొగవే వచ్చినయికాని, దీని ప్రవర్తన మాత్రం స్త్రీకీ పురుషుడికీ మధ్యమరీతిగా తయారైంది. కాని ఆ శస్త్రమప్పుడే మరో ఆడపంది అండకోశాలనికూడా దానికి అతికితే అది అచ్చు ఆడపందిలా పెరిగింది!! అది సాధారణ మొగపందికంటే చిన్నదిగా ఉండి మొగవాటిని ఆకర్షిస్తుంది! దాని పాలగ్రంథులు పెద్దవై పాలని కూడా యిచ్చింది!! - అయితే అది పూర్తిగా ఆడదైపోడాని కవకాశంలేదు. ఎంచేతంటే పుట్టుకకి పూర్వమే అంతరంగ నిర్మాణం జరిగిపోతుంది. కనక అది వెనక్కి తిప్పలేము. - కాని పై ప్రయోగాల ఫలితంగా యీ లింగ హార్మోనులకి దేహంమీద ఎంత కంట్రోలు ఉన్నదీ తేలుతుంది. ఇటువంటి ప్రయోగాలు మానవ శిశువులమీద చెయ్యటానికి వీల్లేదు. కారణం : ఎవరూ వప్పుకోరు!! కాని పరోక్షంగా తెలిసిన నిదర్శనాలవల్ల యీ రకపు మార్పులే మానవ శిశువులోకూడా తెప్పించవచ్చుననడానికి సందేహమేమీ లేదు.

దురదృష్టం చేతనో, జబ్బుల చేతనో శైశవంలోనే యీ లింగ గ్రంథులు చెడిపోయినా, లేక కారణాంతరాలవల్ల వాటి కార్యకలాపం పెడత్రోవ పట్టడంవల్లనో మానవశిశువుల్లోకూడా యిట్టాంటి విపరీతాలు సంభవిస్తయి. అటువంటి వ్యక్తులు లింగరీత్యా పూర్తిగా వికసించక స్త్రీ పురుషులకు మధ్యగా ఉంటారు. యౌవనం వచ్చినప్పుడు, పురుషుని కంఠధ్వని సాధారణంగా బొంగురుపోతుంది. కాని పై విపరీత వ్యక్తుల్లో అలాకాకుండా స్త్రీ కంఠధ్వనిలాగే ఉంటుంది. అలాగే కొంతమంది స్త్రీల కంఠధ్వనికూడా పురుష ధ్వనిని పొందుతుంది. ఇంకా దురదృష్ట వ్యక్తులలో విపరీత చిహ్నాలు కలుగుతాయి. మన దేహంలో ''పిట్యూటరీ'' అన్న గ్రంథి ఒకటి ఉంటుంది. దాని రసాయనం తక్కువయితే వ్యక్తి పూర్తిగా పెరగక ఎల్లప్పుడూ కౌమారంలోనే ఉండడం సంభవిస్తుంది. అటువంటి వ్యక్తికి కృత్రిమంగా తయారుచేసిన పిట్యూటరీ రసాయనాన్నిస్తే ఆ వైపరీత్యం తొలగి సాధారణ పెరుగుదల వస్తుంది. కనుక నిజమైన మధ్యమతరగతివారు ఏదో కారణంచేత అంతరంగ రసాయన వ్యవస్థ పాడుపడిన దురదృష్టవంతులన్నమాట. సాధారణ స్త్రీపురుషుల ప్రవర్తన వారికెంత సహజమో వీరికికూడా వీరి ప్రవర్తన అంత సహజమే! నిజంగా మన ప్రవర్తన మన అంతరంగిక రసాయన ప్రవర్తనమే!!

ఇంకా గత నలభై, ఏభై సంవత్సరాలలో మానవుడి బుద్ధి సూక్ష్మతకీ, పరిశోధనా చాతుర్యానికీ లొంగిన విషయాలనేకం ఉన్నాయి. కాని యీ చిన్న స్థలంలో సాధారణ పాఠకుణ్ణి విసుగెత్తించకుండా వాటిని చెప్పడం సాధ్యం కాదు. కాని మొత్తంమీద తేలిన విషయం ఏమిటంటే : సంయోగక్షణంలోనే క్రోమోజోములవల్ల నీ శిశువు లింగ నిర్ణయం జరిగిపోయినా, తరువాత కూడా ఆ లింగ పరిపూర్ణత్వానికి చాలా క్లిష్టమై, విచిత్రమైన రసాయన పరిస్థితులు అనుకూలించాలని తేలుతుంది. సాధారణంగా యివి అండ, వీర్యకోశ హార్మోనులవల్ల సాఫీగా జరిగిపోతాయి. అపుడే నీ కొడుకు సరియైన మగవాడూ, నీ కూతురు పరిపూర్ణమైన స్త్రీ ఔతుంది. తరువాత కూడా ఈ హార్మోనులు జీవితంలో చాలా ప్రతిభావంతంగా పనిచేస్తాయని తేలింది. ఇంకో సువార్త : మన పరిశోధనల ఫలితంగా ఈ హార్మోనుల కార్యకలాపం చాలామట్టుకు తెలుసుకున్నాం. ఒక అర్ధశతాబ్దం క్రిందట మనకు దురూహ్యమై, అర్థం కాని విషయాలనేక మిప్పుడు ఈ అంతరాంగిక రసాయనాల మూలంగా

తెలుసుకున్నాం. ఆనాడు చెయ్యలేని అనేక కార్యాలనిప్పుడు చెయ్యగలుగుతున్నాం. పైగా, వీటిలో అనేక హార్మోనులనీ, రసాయనాలనీ మన పరిశోధనాలయాల్లో చెయ్యడం కూడా నేర్చుకున్నాం. వీటి ఫలితంగా మానవ జీవితం పూర్వంకంటే అర్థవంతమై, మానవ ప్రవర్తన తనపట్లా, యితర స్త్రీపురుషుల పట్లా, దురదృష్టవశాత్తూ అభాగ్యులయి అసంపూర్ణ వ్యక్తిత్వం పొందిన అభాగ్యులపట్లా శాస్త్రీయమై, సభ్యతాయుత మవడానికెంతైనా అవకాశం ఉంది.

నీ కొడుకూ, నీ కూతురు ప్రస్తుత కథా భాగాన్ని ముగించే ముందు రెండు విషయాలు మాత్రం తెలుసుకుందాం.

ఒకటి - పరిశోధనల ఫలితంగా వీర్యకోశ హార్మోను అండకోశ హార్మోను కంటే ప్రతిభావంతమైనదని తేలింది. దానికి క్రింది ప్రయోగ ఫలితాలే నిదర్శనం. ఆదిలో మొగ శిశువు అండకోశాలు తీసేస్తే దాని మగత్వానికి చాలా లోపం వచ్చి అది స్త్రీత్వాన్ని హెచ్చుగా పొందుతుంది. మగ హార్మోనును ఆడ జంతువుకు యిస్తే అది మగ గుణాలని పొందుతుంది. ఈవిధంగా మన హార్మోను కార్యం రూఢిగా మగ గుణాలని పెంపొందించడంలో ఋజువవుతుంది పిల్లలకి పాలిచ్చే జంతు శాఖ (Mammals) అంతటిలోనూ. కాని ఆడ జంతువులోని అండకోశ హార్మోను కార్యం పరోక్షమైనది. అండకోశాలని రెంటినీ తీసివేసినా స్త్రీ శిశువు దాని అభివృద్ధి వేగ మేమాత్రం తగ్గక, స్త్రీగానే మారుతుంది. స్త్రీగా మారటానికి కావలసినదల్లా పురుష హార్మోను లేకపోవడమే అని తేలిందీ ప్రయోగంవల్ల - అంటే - పిండానికి ఉన్న స్త్రీ వ్యవస్థ అండకోశ హార్మోను లేకపోయినా, స్వయంభవంగా తవని వృద్ధి చేసుకొనే శక్తి స్త్రీ నిర్మాణంలో ఆదినుంచీ ఉంది. పురుషత్వానికి మాత్రం వీర్యకోశ హార్మోను అవసరం. కనక యవ్వనం వచ్చే వరకూ స్త్రీ అభివృద్ధికి హార్మోనులతో గత్యంతరం లేని అవసరం లేదు. పురుషుడికి మాత్రం అది లేక జరగదు. అది లేకపోయిన మొగశిశువు కూడా స్త్రీత్వానికి దగ్గరగా చేరుతుంది. - అంటే పాలిచ్చే తెగలలో ప్రతి జంతువూ స్త్రీ అవడానికి హెచ్చు సహజగుణం ఉందన్నమాట!! మగత్వం రావాలంటే ప్రత్యేక కార్యకలాపం జరగాలి!! కనక యీ తెగలో 'స్త్రీ' పునాది - సనాతనమైన వ్యవస్థ - అనీ, పురుషత్వం దానిపై ప్రత్యేకత పొందిన రూపాంతరంగా కనిపిస్తుంది!! అంచేత క్రిస్టియను గాథల్లో చెప్పినట్టు ఆదాములో ఒక భాగంనుండి ''అవ్వ'' తయారయిందనడంకంటే, అవ్వనుంచే ఆదాము తయారయ్యేడనడం జీవశాస్త్రరీత్యా హెచ్చు సమంజసం!! ప్రప్రథమమూ, సహజమూ, సనాతనమూ అయినది స్త్రీ రూపమే!!

పక్షులలో మాత్రం లింగవ్యవస్థ దీనికి సరిగ్గా వ్యతిరేకం!!

**మరొక్క విషయం :** మానవ దేహంలో వీర్యకోశ, అండకోశాలే కాకుండా అనేక అంతరంగిక రసాయన గ్రంథులున్నాయి. వీటిని గురించి విపులంగా తెలుసుకోవాలంటే ప్రత్యేక శాస్త్రజ్ఞానం అవసరం. కాని వీటిల్లో ముఖ్యమైనవాటి గురించీ, వాటి కార్యాలగురించీ, తగువమాత్రం తెలుసుకుందాం. ఈ గ్రంథుల్ని నాళరహిత గ్రంథులంటారు. ఇందులో ముఖ్యమైనవీ, మన విషయానికి హెచ్చు సంబంధించినవీ మూడు : పిట్యూటరీ, థైరాయిడు, ఎడ్రినాల్ గ్రంథులు.

ఇందులో పిట్యూటరీ గ్రంథిని శాస్త్రజ్ఞులు నాయకగ్రంథి అన్నారు. కారణం దీని ప్రాముఖ్యతా, యితర గ్రంథులమీద దీనికున్న ప్రభావమే! ఇది మెదడుకూ, కపాలపు ఎముకలకూ మధ్య

ఉంటుంది. ఇందులో ఒక భాగంలో ఉత్పత్తిఅయ్యే రసాయనం లింగాంగాల అభివృద్ధిని కంట్రోలు చేస్తుంది. ఇది తక్కువ అయితే స్త్రీగాని పురుషుడుగాని ఎప్పుడూ కౌమారదశ వదలక యౌవనం పొందక లింగరీత్యా వికసించడం ఉండదు. ఇందులో మరోభాగం, మనిషి పెరుగుతున్నప్పుడు అతిగా పనిచేస్తే, ఆ వ్యక్తి చేతులూ, కాళ్ళూ వికృతంగా పెద్దవై మోటుగా, అతిపొడుగ్గా, అంద వికారంగా తయారవుతాడు. తక్కువయితే వంటినిండా అసహజమైనచోట క్రొవ్వు పెరిగి మరుగుజ్జు రూపం వస్తుంది. దీని రసాయనం కృత్రిమంగా తయారు చేయగలం.

రెండవది : థైరాయిడుగ్రంథి - యిది కంఠం దగ్గర ఉంటుంది. ఇది థైరాక్సిను అన్న రసాన్ని తయారుచేస్తుంది. దీన్ని కూడా మనం చెయ్యగలం. ఇది తక్కువయితే దేహంలోని రసాయన కార్యాలన్నీ వెనకబడతయి. నాడి తగ్గుతుంది. మనస్సు చురుకుదనం ఉండదు. ఇది తక్కువయిన పిల్లల్లో పెరుగుదల మందగించి, మెదడూ, అస్థిపంజరం వెనకబడి, 30 ఏళ్ళ వ్యక్తికూడా చిన్న కుర్రాడిలా మొద్దులా వుండి, తెలివి తేటలేమీ ఉండవు కాని ఈ రసాన్ని మందుగా వాడితే క్రమపరిస్థితు లేర్పడి సాధారణత్వం పొందుతాడు.

మూడవది : ఎడ్రినాల్‌గ్రంథి. ఇందులో ఒక భాగం స్త్రీలో హెచ్చుగా పనిచేస్తే ఆమెకంఠం బొంగురుపోయి, మగగొంతూ, మగరుచులూ, మగగుణాలూ ఏర్పడతయి. దీని రసాన్ని కూడా మనం తయారు చేయగలం.

ఇంకా అనేక గ్రంథూధులూ,, వివిధ కార్యాలూ ఉన్నయి. కాని యిక్కడ వాటన్నిటి గురించీ తెలుసుకోలేం - ప్రస్తుతం ముగించేముందు ఒక్కమాట - ఈ గ్రంథులూ, రసాయనాలూ, హార్మోనులూ, దేనిమట్టుకవి వేరువేరుగా పనిచేస్తాయనుకోకూడదు. వీటన్నిటిమధ్యా పరస్పర సంబంధమూ, ప్రభావాలూ ఉన్నాయి. నీ కొడుకూ, నీ కూతురూ శారీరకంగా, మానసికంగా, లింగరీత్యా ఆరోగ్యంగా పెరగటానికీ, ఉండటానికీ కారణం యివన్నీ తూ.చ. తప్పని ఒక స్నేహబృందంలా పనిచెయ్యడమే - యిందులో ఏ ఒక్కటి ఎదురు తిరిగినా మరికొన్ని ఎదురు తిరగవచ్చు, విపరీతాలూ సంభవించవచ్చు. అందులోనూ, అత్యున్నతమూ, సున్నితమూ, వివిధ వికారాలూ కలిగి, లింగ రీత్యా అనేక మనోభావాలవల్లా, బాహ్య ప్రపంచంవల్లా ఒత్తిడి చేయబడగలిగే మెదడున్న స్త్రీ పురుష జీవు లనుక్షణమూ యీ గ్రంథులవల్ల కంట్రోలు చెయ్యబడతాయి. కనుక సర్వతోముఖమైన ఆరోగ్య జీవితం గడపాలంటే జ్ఞానం వచ్చిననాటి నుంచీ నీ కొడుకూ, నీ కూతురూ యీ అంతరాంగ మహావిశ్వంలోని కార్యకలాపాలూ, గ్రంథుల హావభావాలూ, వాటి ప్రాముఖ్యతా తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

ప్రథమక్షణంలోని క్రోమోజోముల నాధారం చేసుకుని నీ శిశువు ఇంత క్లిష్టమైన రసాయన యంత్రాంగ సహాయంతో స్త్రీయో, పురుషుడో అయి జన్మిస్తుంది.

**(ఇదే సంపాదకత్వంలోని 15 మార్చి, 1948 'జ్యోతి' పక్షపత్రిక నుండి)**

# నవ్వులకు కంట్రోల్

హాస్యం మనిషి ఆరోగ్యాన్ని కాపాడే ఓ మంచి టానిక్ - అని ఓ హాస్య ప్రియుడు చమత్కరించాడు. ఈ సూక్తి నిజమే కూడా. దైనందిన శ్రమను కష్టాన్ని మరిపించి మనస్సును తేలిక పరిచి హాయిగొలిపే దివ్యమైన ఔషధం నవ్వేనని చెప్పవచ్చు. అందుకే సంతోషం సగం బలం అన్నారు. కళకళలాడుతూ తిరుగుతూ చతురోక్తులతో కిలకిలనవ్వులు కురిపించే సంతోష రాయుళ్ళు అందరికీ యిష్టులే ఔతారు. ఇలాంటి ఆనందాల కల్పతరువు లాంటి ఓ మనుమడికి తెల్లవారి కళ్ళు తెరిచి చూసే సరికి-ఎదురుగా అప్పుడే శుభ్రంగా స్నానం చేసి లోపలికి వస్తున్న తాతగారు కన్పించారుట. ఇంకేం అబ్బాయిగారిలో హాస్యప్రియత్వం విజృంభించి అశువుగా పద్యం అందుకున్నాడు. ''ప్రాతర్ఘటికల వేళ్కాని బ్రాతిగబలుదోమి శుభ్రపరిధానుడవై-'' అంటూ మొదలుపెట్టి - ''మాతామహుడవు పెద్దవు తాతా నావీపు గోకుదువా లేదా- '' అని మారాం చేశాడుట. తాతయ్యా వీపుగోకు అని అడగటానికి యింత చదువు చదివిన అల్లరి మనవడు ఎవరికి ముద్దుకాడు? - ఇటువంటి ఆనందరావులు ఎక్కడవుంటే అక్కడ నవ్వులపువ్వులు విరుస్తూవుంటాయి. ఈ బాపతు చమత్కారే ఒకరు ఉపాధ్యాయవృత్తి వెలిగిస్తున్నారు. అటువంటి ఆయనను ఓ సారి కెమిస్ట్రీ ప్రశ్నా పత్రం తయారు చేయమన్నారుట. దాంతో ఆయనలో చమత్కారం పొంగిపొరలి - వంట లక్కలోనుంచి లక్కను ఎట్లు విడదీయుదువు-కల్లెక్టరు మామిడి కాయలోనుంచి ఒక కల్లెక్టరును కాని లేదా కనీసం ఓ డిప్యూటీ కల్లెక్టరును కాని వేరుచేసి ప్రక్కనుంచు పద్ధతిని వివరించుము- లాంటి ప్రశ్నలు గుప్పించాడు. వెనకటి తరానికి చెందిన ఓ హాస్యరచయిత రాసిన ఓ వ్యాసంలో యిలాంటి నవ్వుల రవ్వలు అనేకం వెల్లివిరిశాయి. లోగడ రాజాస్థానాలలో హాస్యానికి ప్రత్యేకమైనగౌరవం ఉండేది. ఆస్థాన విదూషకులు తమ హాస్యోక్తులతో సభలను రక్తికట్టిస్తూ ఉండేవారు. బీర్బల్, తెనాలి రామకృష్ణుడు వంటి హాస్యబ్రహ్మలు సృష్టించిన హాస్యచరిత్రలు యీనాటికీ నవ్వుతెప్పిస్తూనే వుంటాయి. హాస్యం అనేక దేహరుగ్మతలను పోగొట్టి మనిషికి స్వస్థత కలిగించగలదని నమ్మే వైద్యులున్నారు. అలాంటి సరస ధన్వంతురుల ప్రేరణవల్లే కాళిదాసు ''లంబోదర ప్రహసనం'' అనే ఓ కావ్యాన్ని రాశాడనిచెప్పే కథఒకటి ప్రచారంలోఉంది

పూర్వం భోజరాజు ఏ వైద్యునికీ అర్థంకాని తీవ్రమైన వ్యాధితో బాధ పడసాగాడుట. ఎందరు వైద్యులు వచ్చినా ఎన్ని మందులు వాడినా ప్రయోజనం లేకపోయింది. చివరకు ఓ అపరధన్వంతరి పరిస్థితులన్నీ కూలంకషంగా సమీక్షించి రాజరిక వ్యవహారాల్లో మునిగి చాలాకాలంగా నవ్వటం మరిచిపోయి నందువల్లే రాజుగారికీ రుగ్మత దాపురించిందని ప్రకటించాడు. ఎవరైనా సరే అయ్యగారిని హాయిగా పకపకా నవ్వించ గలిగినట్లయితే రోగం మటుమాయం అవుతుందని కూడా శలవిచ్చాడు. దాంతో అంతా కాళిదాసునే శరణు వేడుకున్నారు. వెంటనే ఆ మహాకవి ''లంబోదర ప్రహసనమ్'' అనే హాస్యరచనను చేశాడుట. ఆ రచన వింటూనే భోజరాజు గలగలా పకపకా కడుపుబ్బిపోయేలా నవ్వినవ్వి అలసిపోయాట్ట వ్యాధి పత్తాలేకుండా పారి పోయిందని వేరే చెప్పక్కర్లేదు. హాస్య ప్రయోజనాన్ని మరికాస్త పెద్దగా భూతద్దంలో పెట్టి యీ ఉదంతంలో చూపించిన మాట నిజమే అయినప్పటికీ హాస్యం మనిషిలోని టెన్షన్‌ను తగ్గిస్తుందని చెప్పుకోటానికి ఎవరూ వెనుకాడ నక్కరలేదు. అయితే సదా గాంభీర్యాన్ని పులుముకొని కొంపలంటుకు పోయినట్లు తిరిగే కొందరు కలకలమనే నవ్వుల్ని సహించరు. అలాంటి కవే ఒకరు - ''నవ్వంగరాదు పలుమరు-'' అంటూ నీతి పాఠాలు మొదలు పెట్టి- ''నవ్విన చిరునవ్వెగాని నగరాదెపుడున్ గవ్వలవలె దంతంబులు జవ్వన గానంగబడెడి జాడ-'' అంటూ నవ్వుకు అనేక హద్దులు ఏర్పరిచాడు.

పైకవికి ఏ విధంగా చుట్టాలౌతారో కాని తైవాన్‌కు చెందిన ఓ కంపెనీ వారు తమ ఉద్యోగులెవరూ

పనివేళలలో నవ్వరాదంటూ నిబంధనవిధించారు. టాటుంగ్‌కు చెందిన యీ సంస్థ ఎలక్ట్రానిక్ పరికరాలను ఉత్పత్తి చేస్తుంది. వీరికి బ్రిటన్‌లో అనేక అనుబంధ ఫ్యాక్టరీలున్నాయి. ఈ ఫ్యాక్టరీలన్నిటిలో పనిచేసే ఉద్యోగులెవరూ కార్యాలయంలో నవ్వరాదంటూ ఆంక్షలువిధించారు. సదా మూతి బిగించుకొని యమ సీరియస్‌గా పనిచేసుకు పోతూ వుండాలిట. నవ్వుల్లో పడితే పని వెనుకపడి ఉత్పత్తి తరిగి పోగలదని వీరి అభిప్రాయం. అందుకే పనివారు నవ్వులజోలికి పోకుండా కాపలా కాసేందుకు ప్రత్యేకంగా సూపర్‌వైజర్లను కూడా నియమించారు. ఈ పద్ధతి సరయింది కాదనికార్మిక సంఘాలవారు అభ్యంతరాలు తెలుపుతున్నారు. ఈసురోమంటూ చేసేటప్పటి కంటే నవ్వుతూ నవ్విస్తూ చేసేటప్పుడే ఎక్కువ పని జరుగగలదని వీరు వాదిస్తున్నారు. నిజానికి ఆహ్లాదకరమైన వాతావరణంలో పనిచేసినప్పడే మంచి ఫలితాలను సాధించవచ్చునని నిస్సందేహంగా చెప్పవచ్చు. నవ్వులను కంట్రోల్‌లో పెట్టి ఉత్సాహానికి ఆనకట్ట వేసినట్లయితే పనికూడా అంతంత మాత్రంగానే సాగుతుంది. త్రుళ్ళే ఎద్దే గంత మోస్తుంది అన్నట్లు నవ్వుతూ సరదాగా వుండేవారే నాలుగు పనులూ చకచకా చక్కపెట్టెయ్యగలరు. ఎవరైనా యీ విషయం గ్రహించుకొని ప్రవర్తించినప్పుడే మంచి ఫలితాలు సంప్రాప్తిస్తాయి!

(ప్రముఖ జాతీయ తెలుగు దినపత్రిక 'ఈనాడు' సౌజన్యంతో)

• • • • • • • • • • • • • • •

## మిత్రులు రవీంద్రనాథ్ గారు!

కొందరు వ్యక్తులు, కొన్ని సంఘటనలు, కొన్ని శిల్పాలు, కొన్ని చిత్రాలు, కొన్ని కావ్యాలు, కొన్ని పాత్రలు, కొన్ని నిర్మాణాలు - కాల ప్రవాహంలో పడికొట్టుకుపోకుండా, చిరకాలం ఉంటాయి. కొన్నింటి ఆవిర్భావమూ, అంతర్ధానమూ ఒకేసారి జరుగుతూ ఉంటుంది.

ఈజిప్టులోని పిరమిడ్లు, గ్రీకులోని నాటకశాలలు, ఎల్లోరా గుహాశిల్పాలు, కాళిదాసుని శాకుంతలం, భవభూతి ఉత్తర రామచరితం, తిక్కన భారతం, శ్రీనాథుని నైషధం, సూరన కళాపూర్ణోదయం,... వంటివి ఈనాటికీ నిలిచి ఉన్నాయి.

అలా సాహితీ క్షేత్రంలో ఎందరెందరు, ఎన్నిరకాల పంటలను పుష్కలంగా పండించినా; ఎన్ని చిత్ర విచిత్ర సన్నివేశాలు కల్పించినా; ఎంత నైపుణ్యంతో పాత్రలను మలిచినా; ఆ పాత్రలన్నీ బతికి బట్టకట్టవు; మనదాకానూ రావు. ఒకవేళ వచ్చినా, చెరిగిపోనంత సాంద్రంగా, మన హృదయాలమీద తమ ఉనికిని ముద్రించవు.

గురజాడ అప్పారావుగారి - గిరీశం, మధురవాణి; వేదం వెంకట రాయశాస్త్రిగారి - పేరిగాడు; నండూరి వారి - ఎంకి, నాయుడు బావ; ఋనిమాణిక్యంవారి - కాంతం; చింతాదీక్షితులుగారి - వటీరావు; మొక్కపాటి వారి - బారిస్టర్ పార్వతీశం; గోపీచంద్‌గారి - సీతారామారావు వంటి పాత్రలు, తెలుగు సాహితీ చరిత్రలో కలకాలం ఉండిపోతాయి!

ఈ శతాబ్ది ఆరంభంలో ఆవిర్భవించి, ఇప్పటిదాకా, మనమధ్యనే తిరుగుతోన్న ఈ పాత్రల ఆనుపానులేమిటి? విశిష్టతలేమిటి? ఇలా జీవంతం కావడం వెనుకగల ''రహస్యం'' ఏమిటి? మచ్చుకు - కొన్ని పాత్రలను మాత్రమే ఇక్కడ పేర్కొన్నాంగానీ - ఇంకా చాలా ఉన్నాయి. సుమారుగా ''50 సంవత్సరాల పైబడిన వయస్సున్న పాత్ర''లను గురించిన విశ్లేషణాత్మక రచనలను వరుసగా ప్రచురించాలని నా సలహా!

యీ ప్రయోగం మిసిమి చెయ్యగలదన్న నమ్మకంతో—

— రావూరి భరద్వాజ

పిఠాపుర ప్రభువు లేటు

# శ్రీ గంగాధర రామారావుగారి కథలు

– చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

శతావధాని

పైని వుదాహరించిన ప్రభువరేణ్యుని అత్యద్భుత చర్యలు మాప్రాంతములలో తఱచుగా చెప్పుకుంటూ వుంటారు. నాకు కొంచెం ప్రాజ్ఞత కలిగేటప్పటికి వీరు తుట్టతుదిదశలో వున్నారు. వీరిని నేను చూడడం చూశాను. గాని, నన్నుమాత్రం వారెఱగడానికి తగ్గస్థితిలో అప్పటికి నేను లేను. నేను కాశీనుండి కాశీకావడి బుజాన్ని పెట్టుకొని వచ్చే రోజులలో తునికిన్నీ అన్నవరానికిన్నీ మధ్యగావున్న తేటగుంట, తిమ్మాపురం వద్దకు వచ్చేటప్పటికి యీ మహారాజు ద్వాదశాహస్సునాటి సంభావన పుచ్చుకొన్న బ్రాహ్మణ్యాం యెదురుగా వచ్చింది. నాకు నామరూపాలు కలగడం కాశీనుంచి వచ్చిన మరుచటినాటినుండే కావడంచేత, వారిని నేనెరగడమేకాని నన్ను వారెఱిగివుండే యోగం తటస్థించలేదు. అదిన్నీకాక యీ ప్రభువు సుమారు 5,6, సంవత్సరాల కాలం అంత్యదశలో కొంత అనారోగ్యంగావుండి -''కాశ్యాంతు మరణాన్ముక్తిః'' కనక కాశీలో భౌతికదేహం చాలించే వుద్దేశంతో వకటి రెండుసార్లు కాశీకి వెళ్ళినట్లుకూడా వింటాను. కాని తుదకు వీరు తమ రాజధానియగు పిఠాపురంలోనే కోటలోనే భౌతికదేహాన్ని చాలించినారు. వీరు భౌతిక దేహాన్ని చాలించేనాటికి కొంచెం పూర్వగాథలు నాకు తెలియటాని కభ్యంతరం లేదుగాని, వీరు రాజ్యానికి వచ్చిన కొలది కాలం నాటి చర్యలు నాకు వినికివల్ల తెలిసినవేకాని ప్రత్యక్షంగా తెలిసినవి మాత్రం కావు. బహుశః, గతించిన ధాత, ఈశ్వర సంవత్సరాల ప్రాంతంలో జరిగిన వక చర్యను గూర్చి యిందు వ్రాస్తాను.

## జియ్యంగారి రాక

అప్పటికి నావయస్సు సుమారు ఆరు సంవత్సరాలకు దాదాపు. అప్పుడు కఱవు వచ్చింది. రూపాయిపెట్టి బియ్యంకొంటే చేటలోకి పూర్తిగా వచ్చేవి కావు. యిటీవల బియ్యపుధర ఆమాదిరిగా వున్న రోజులు నా బాల్యానంతరం చాలా వున్నాయి గాని కఱవనిమాత్రం లోకం అనుకున్నట్లు లేదు. ఆ కాలానికి అదే పెద్దకఱవు. అప్పటికింకా మా కుటుంబము కడియం గ్రామంలోనేవుంది. నాకు తగుమాత్రం అప్పటి సంగతులిప్పటికిన్నీ జ్ఞప్తిలో వున్నాయి. గాని యిప్పుడు వ్రాసేది మాత్రం యిటీవల విన్నదేగాని అనుభవించి జ్ఞాపకముంచుకొన్నది కాదు. అప్పుడు మా గ్రామం జియ్యంగారు వచ్చారని చెప్పుకోవడం మట్టుకు జ్ఞాపకం వుంది. ''బియ్యం''గారని వాడినట్లు కూడా జ్ఞాపకం వుంది. యిక వ్రాయబోయే సంగతులేవిన్నీ జ్ఞప్తిమీద వ్రాసేవికావు. మాతండ్రిగారు వగయిరా లిటీవల చెప్పుకొనేటప్పుడు విన్నవే.

జియ్యంగారంటే, బహుశః శ్రీవానమామల జియ్యంగారై వుండాలి. వీరు శ్రీవైష్ణవ పీఠస్థులు. స్మార్తులకు శ్రీశంకరాచార్యపీఠం యేలాటిదో విశిష్టాద్వైతులకు యీ పీఠమున్నూ ఆలాంటిదే. యిటీవల చాలాభాగము ఆ యీ పీఠస్థుల పవరు తగ్గిందికాని మా చిన్నతనంలో గవర్నమెంటువారి కన్న యీ పీఠస్థులకు తక్కువ అధికారం వున్నట్టు లేదు. వారికి యివ్వవలసిన పాదపూజ సమర్పించకపోతే ఆ యీ గృహస్థుల యిళ్ళల్లో సామాను జప్తుచేయడం వగయిరా అధికారాలు పీఠస్థులకు గవర్నమెంటుతోపాటు వుండే రోజులు నేను కొంచెం ఎరుగుదును. క్రమంగా మా గోదావరి డిస్ట్రిక్టుకు పీఠమంటూ వుండడమే అంతరించి చాలా రోజులయింది. సుమారు నలభైయేండ్ల దరిమిలాను మా ప్రాంతానికి శంకరాచార్యపీఠం వచ్చినట్టుగాని, పాదపూజ సమర్పించినట్టుగాని నేనెఱుగనే యెఱుగను. కాని సుమారు పదేండ్లనాడు కాబోలును, యెవరో మాంతాచార్యస్వాములవారంటూ మా సమీపగ్రామం

జేగురుపాడుకు వచ్చి నాపేర శ్రీముఖం పంపించారు. శ్రీముఖం అంటే గురుపీఠంవారు శిష్యులకు పంపే నోటీసు. దానిమీద నాకు తోచిన పాదపూజ పంపించుకొన్నాను గాని తీరికలేక వారి సందర్శనానికి వెళ్ళలేదు. మొత్తం చిరకాలాన్నుంచి మా జిల్లాకు పీఠస్థుల సందర్శనం లేకపోయిందన్నది ప్రస్తుతం.

## శైవం - వైష్ణవం

వానమామల పీఠస్థులు మాగ్రామం దయచేయడానికి కారణం శ్రీపిఠాపురం రాజావారే. మాప్రాంతం వెలమవారందఱున్నూ వైష్ణవ మతస్థులే. నేను వెంకటగిరి సంస్థానానికి వెళ్ళడానికి పూర్వం వెలమవారిలో శైవులున్నారని సుతరామున్నూ యెఱుగను. యీకారణం చేతనే వెంకటగిరి స్టేషనులో ఒక వెలమదొరగారితో నాకు నిష్కారణంగా పోట్లాట తటస్థించింది. ఆయన చాలా మంచివారు కనుక కాని, లేకపోతే నాకు ఆ పోట్లాటలో ''తస్యప్రహరణ'' మహోత్సవంకూడా జరిగేదే. అసలు కథేమిటంటే, జంగందేవర వేషముతో వకాయన ఆ స్టేషనులో నాకు ప్రత్యక్షమైనారు. ఆయనతో నేను సామాన్యపు జంగాలతోవలెనే మాట్లాడుతూ వున్నాను. ఆయన మంచివారు కనుక మేము వెలమవారం అని చెప్పారు పాపం. కాదు, మీరు జంగాలన్నాను నేను. యెఱుగనప్పుడు నేనేమన్నా, ఆయన యథార్థం చెప్పిన తరువాతేనా వెనక తగ్గవలసింది. కాని ఆయన వేషం, వకగంటా శంఖమూ యింతే తరువాయిగాని పూర్తిగా జంగం దేవరలా కనపడింది. పయిగా వెలమవారేమిటి? విభూతి రుద్రాక్షలు వేసుకోవడం ఏమిటి? అని వకశంక. అందుచేత ఆయన మాటను నేను బొత్తిగా నమ్మలేకపోయాను. తుదకు విధిలేక నమ్మి, ''మావైపున వెలంవారు యెవ్వరూ విభూతివగయిరా ధరింపరు.'' అంటూ యేవో రెండు యథార్థమైనమాటలే చెప్పి ఆయనవల్ల కాళహస్తి ప్రాంతంలో శివభక్తులైన వెలంవారు వున్నట్టు తెలిసి కొన్నాను. యిటీవల చాలారోజులకు గుంటూరు సీమ వివాదలనాడు చేబ్రోలు కమ్మవారిని చూచి కమ్మవారిలో శైవులుండడం తెలుసుకున్నాను. అలాగే హైదరాబాదా ప్రాంతంలో కంసాలులలో తిరువణి ధారులున్నట్లు తెలుసుకున్నాను. అందుకే కూపకూర్మంగా వుండడం యెవరికీ కూడదు. కవికి బొత్తిగా కూడదని అనుభవజ్ఞులు చెప్తారు. ''అప్రవాసినంచ బ్రాహ్మణందృష్ట్వా సచేలస్నాన మాచరేత్'' అనేవారట మా గురువుగారి గురుపరంపరలో వకరైన శ్రీ యింద్రగంటి గోపాలశాస్త్రుర్లుగారు. అది అట్లా వుండనిచ్చి ప్రకృతం మాట్లాడుకుంటాం.

## వర్ణాశ్రమాచారాల పట్టుదల

శ్రీ గంగాధర రామారావుగారు వైష్ణవ మతస్థులవడంచేత వారు పిలిపిస్తే వానమామల జియ్యంగారు శ్రీ రాజావారి ప్రధానగ్రామాల్లో ఒకటైన మా కడియం గ్రామం దయ చేశారు. వారు దయచేసేటప్పటికి శ్రీ బులుసు పాపయ్య శాస్త్రులవారు కూడా శ్రీ రాజావారి సమక్షమందే దయచేసి యున్నారు. శ్రీ రాజావారికి గురుదర్శనానికి వెళ్ళేటప్పుడు పాపయ్య శాస్త్రులవారి సహితంగా వెళ్ళాలని కుతూహలం వుంది. కాని రాజావారికి వారు గురువులు గాని పాపయ్య శాస్త్రులవారికి వారు మతరీత్యా గురువులు గారుగదా? విద్యలోనో, యెవరూకారు. అట్టిస్థితిలో వారి సందర్శనానికి వీరేలావస్తారు? స్వబుద్ధిచేత రారు. శ్రీరాజావారు మాత్రం రావలసిందని యేలా కోరుతారు? అప్పటి రాజులంటే వర్ణాశ్రమాచారాలను పరిపాలించడానికి బద్ధకంకణులు కదా? ఆ రాజావారి రోజులలో మన గవర్నమెంటు యింత కట్టుదిట్టంలో లేకపోయినా కొంతేనా వ్యాపకంలో లేకపోలేదు. గవర్నమెంటు అధికారాలలో యేకొంచెమోతప్ప ''నాన్‌బ్రామిన్సు'' వున్నట్టు లేదు. గొప్ప గొప్ప పదవులలో యేచిన్న పరీక్షలో ప్యాసయిన బ్రాహ్మణులే వుండేవారు. అప్పటి ప్లీడర్ల ఆర్గ్యుమెంటునుగూర్చి యిప్పటికిన్నీ కొందఱు వేళాకోళంగా చెప్పుకుంటూ వుంటారు. కోర్టు మునసబుగారు మీ ఆర్గ్యుమెంటు చెప్పండనేసరికి, యెవరో వక్కలంకాయనట, పేరు జ్ఞాపకంలేదు. ''నేను చాలా పెద్దకుటుంబీకుడను, వేఱే మనవిచేసేదేమిటి? యీకేసు కోర్టువారు నాకు వ్యతిరేకంగా చేస్తే నాదగ్గఱికి మఱోకేసు రాదు, కాబట్టి అనుగ్రహించవలసిందని

మీ ఘనతను గూర్చి మిక్కిలీ ప్రార్థిస్తాను.'' అని చెప్పేవారట! అట్టిస్థితిలో బ్రాహ్మణ ప్లీడర్లే వుండేరోజుల్లో ''నాన్‌బ్రామిన్సు''కు చదువుసందెలెక్కడ? ఉద్యోగాలెక్కడ? యెవరేనా వక వుద్యోగి వారిలోవుంటే జమీందార్లకు అందులో క్షత్రియ వెలమ యీ జాతి జమీందార్లకు వారికి దర్శనమివ్వడానికిగాని వారితో మాట్లాడటానికిగాని, బొత్తిగా ప్రాణసంకటంగా వుండేదట. దీనికి సంబంధించిన గాథలు పిఠాపురం సంస్థానానికి చెందినవే చాలా వున్నాయి. వాట్లను గూర్చి మఱొకప్పుడు మాట్లాడుకొందాం అప్పటి జమీందార్లకేమి, ప్రజలకేమి వర్ణాశ్రమాచారాల విషయమై మిక్కిలి పట్టుదల వుండేదన్నది ప్రస్తుతం.

## గజానికి గజమున్నర లెక్క

ఆ కారణంచేత శ్రీ పాపయ్య శాస్త్రుల్లుగారు జియ్యంగారి దర్శనానికి వెళ్ళావెళ్ళరు. వారిని శ్రీ రాజావారు రమ్మని అనా అనరు. కాని ప్రస్తుతం అలా జరుగలేదు. దీనిలో మహాపాతక మేముందనే తాత్పర్యంతో, ''మహా పండితులుగదా శాస్తుల్లుగా''రని ఆలోచించి, అయినా యేమంటారో చూతామని రాజావారు 'శాస్తుల్లుగారూ జియ్యంగారి దర్శనానికి మాతో తాము దయచేయడానికేమైనా అభ్యంతరం వుంటుందా?' అన్నారట, విలాసంగా. దానిమీద పాపయ్య శాస్తుల్లుగారికి పచ్చివెలక్కాయ గొంతుకలో పడ్డట్టయింది పాపం! యేమంటే, నిన్నగాకమొన్న శ్రీ రాజావారిచే స్వయముగా ''మీకు మా యెస్టేటులో యెక్కడ యెంత భూమి కావాలో కోరుకోవలసిం''దని కోరుకోబడి, ''నె 1 కి ఒకపుట్టి భూమి చొప్పున వుంటే చాలును'' అనగా పుట్టి అంటే మావైపున 8 యకరాలు కనుక ''సంవత్సర గ్రాసానికి 12 పుట్ల భూమి 96 యెకరాలు యిప్పించవలసిం''దని కోరుకొని ఆ భూమి వారి స్వగ్రామానికి సమీపంలోవున్న శానపల్లె లంకలో పుచ్చుకొని వున్నారాయె. ఆ పుచ్చుకోవడంలో ఠాణేదారుగారిని, పాండిత్యం చేతనే అనుకోండి, లోపుచేసుకొని 12 పుట్లకు పద్దెనిమ్మిది పుట్లుకూడాకొల్పించుకొని వున్నారు పాపయ్యశాస్తుల్లుగారు. యీ మోసము రాజావారి కేలాగో తెలిసి ఆ ఠాణేదారుని బరతరఫు చేశారు కూడాను. ఆ సంగతి పాపయ్య శాస్తుల్లుగారికి తెలిసి మళ్ళా రాజావారి దర్శనానికి వెళ్ళి తాము మాకు మొన్న దయచేయించిన భూమిని మళ్ళా మీరే స్వీకరించవలసింది. మాకు సుతారామున్నూ అది అక్కరలేదన్నారట పాపయ్య శాస్తుల్లుగారు! ;దానిమీద రాజావారు ''ఇదేమి శాస్త్రుల్లుగారు! యిలా సెలవిస్తూ వున్నారు. మేము మీయెడల చేసిన మహాపరాధమేమిటో దాన్ని వ్యక్తీకరిస్తే సవరించుకోదగ్గదయితే సవరించుకుంటా''మన్నారట. శాస్త్రుల్లుగారు ''యింతకంటే అపరాధ మేం కావాలి. మాకు భూమి కొలిచియిచ్చిన ఠాణేదారుణ్ణి మీరు బరతరఫు చేయడంవల్ల మాకు ఆ భూమియందు అనాదరంకలిగిం''దన్నారట. దానిమీద రాజావారు ''మా వుద్యోగస్థుడు మా ఆజ్ఞకు అన్యధాగా వర్తించడంవల్ల బరతరఫు చేశాం కాని మీ యందు మాకు లేశమున్నూ అనాదరం లేదే'' అన్నారట. దానికి శాస్త్రులుగారు చెప్పిన జవాబేమిటంటే:- ''అయ్యా ఆయన మీ యాజ్ఞకు లేశమున్నూ వ్యతిరేకించలేదు. యేమంటారా? పంద్రెండుపుట్ల భూమి మీరు మాకుకొలిచి వప్పజెప్పవలసిందనేకదా ఆయన కాజ్ఞాపించి ఉన్నారు. ఆయన అట్లే వప్పగించారు. దీనిలో ఆయన తప్పేముందన్నారట.'' రాజావారు ''12టికి 18 పుట్లు యివ్వడం తప్పుకాదా'' అన్నారట. పాపయ్య శాస్త్రులుగారు అన్నారట:- ''అయ్యా, మాకు మీరు భూమి యివ్వడం యెందుకు వచ్చిం''దని ప్రశ్నించారట. మీరు జగదేక పండితులనే కారణంచేత యిచ్చి తరించాలనే వుద్దేశం చేత నన్నారట. సరే ఎందులో పండితులమని మీ వుద్దేశమన్నారట? వేదశాస్త్రాలలో అన్నారట. అవి యే భాష అన్నారట. గీర్వాణభాష అన్నారట రాజావారు. గీర్వాణభాషకదా, గీర్వాణులంటే దేవతలే కదా? మేము ఆ భూమి దేవమానంచేత కొలిపించు కొంటాం గాని మనుష్య మానంచేత యేలాకొలిపించుకొంటామని తమరనుకున్నారంటూ చెప్పి యేలాగయితేనేమి గజానికి గజమున్నర చొప్పున లెక్క కట్టి సరిపెట్టి రాజావారికి నచ్చజెప్పి మళ్ళా ఆ ఠాణేదారు వుద్యోగం ఠాణేదారుకిప్పించి తమ భూమిని తాము నిల్పుకున్నారట. ఆ భూమి అంటే సామాన్యమైనది కాదు.

లంకభూమి. యితరత్ర వక యకరం యెంతఖరీదో అక్కడ వక సెంటు అంతఖరీదు చేస్తుందన్నమాట. అది యిప్పటికిన్నీ వారి కుటుంబీకులు అనుభవిస్తున్నారు.

## శాస్త్రులుగారి లౌక్యప్రజ్ఞ

చెప్పేదేమిటంటే, అట్టి మహాదాత రాజావారు. వారి గురువులదర్శనానికి వెడుతూ, రమ్మంటే రానని శాస్త్రులుగారు ఎలా చెప్పగలరు? ''అర్థస్య పురుషో దాసః'' అన్నాడుగదా భీష్మడంతటివాడు. ద్రోణాదులు కూడా ఆమాటేచెప్పారు ధర్మరాజుతో. అయితే పాపయ్య శాస్త్రుల్లుగారు మహాలౌక్యులు. తుదకు వెళ్ళకుండా చమత్కారంగా తప్పించుకున్నారని వినికి. యేంచేశారంటే :- అయ్యా మా స్మార్తమతం సర్వమతాలని సహిస్తుంది. వానమామలస్వామి దర్శనానికి రావడం నాకు లేశమున్నూ బాధకంకాదు. కాని నన్ను చూడడం వారికి బాధకంగా ఉంటుంది. విభూతి రుద్రాక్షధారణతో వున్నవారిని సామాన్యంగా శ్రీవైష్ణవులే చూడడానికి సంశయిస్తారు. అందులో వారు గురుపీఠంగదా? అట్టివారు సంశయింపకుండా వుంటారా? వకవేళ తమతోవచ్చిన హేతువుచేత యేలాగో స్వామి సహించి వూరుకొన్నా శిష్యులవల్ల ముందుముందేనా వారికి ఆక్షేపణ కలగడం తప్పదు. అనేటప్పటికి రాజావారు వారి లౌక్యప్రజ్ఞకు సంతోషించి వారిని వెంటబెట్టుకొని వెళ్ళకుండానే గురువులవారి దర్శనానికి దయచేశారట!

భూమి కొలత సందర్భములో దేవమాన మనుష్యమానాల విషయం యెట్లావున్నా అప్పటి కాలపు దాతల సౌశీల్యాన్ని మనం ముఖ్యంగా గమనించాలి. అంతేకాక, పాండిత్యంలో యెంతగొప్పతనమున్నా ఛాందసత్వం కొంత దురాశ కలిగింపకమానదని కూడా అనుకోక తప్పదనుకొంటాను. ఆ దురాశవల్ల అవమానం పొందకపోవడమున్నూ పయిగా తమ లౌక్య ప్రజ్ఞచేత తాముతరించడమే కాకుండా తమతోపాటు తాటితోదబ్బనంగా ప్రవర్తించిన (పాలెప్పళ్ళంరాజు) తాణేదారుగారిని కూడా తరింప జేయడం వగైరా పాపయ్య శాస్త్రుల్లుగారి ప్రజ్ఞావిశేషానికి వుదాహరణంగా మనం గ్రహించవచ్చును. ఆయన గనక సరిపోయింది కాని యిదే మఠో పండితుడికి తటస్థిస్తే రాజావారు మంచివారు కనక శాస్త్రుల్లువారికి దక్కితే 18 పుట్ల భూమిన్నీ దక్కేదేమోకాని తాణేదారుగారికి వుద్యోగంవూడి ''ఆగ్నేయంతి'' సిద్ధమయ్యేది.

## రామకవి చాటుధార

ఈ పళ్ళంరాజాగారి తుట్టతుదిదశలో, అనగా వారం పదిహేనురోజుల్లో స్వర్గానికి వెడతారనగా నేనూ వీరిని చూడడం తటస్థించింది. వీరివల్ల ఆ రోజున శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారికి సంబంధించినవిన్నీ, పాపయ్య శాస్త్రుల్లుగారు వగయిరా ఆ కాలంనాటివారికి సంబంధించినవిన్నీ చాలా గాథలు విన్నాను. నన్ను ఆయన యెవరిద్వారానో యేకసంథాగ్రాహినిగా వినివున్నారట. భోజనమయిన తరవాత కూర్చున్నప్పుడు అన్నారుగదా:- వెనక శ్రీ శిష్టు కృష్ణమూర్తిగారికి వుండేది యీ ప్రజ్ఞ యిటీవల తమకు వుందని విన్నాను. యేదోవక పద్యం చదువుతాను మళ్ళా మీరు చదవాలంటూ అడగడానికి మొదలుపెట్టారు. ఆ యీగాథ వికారి సంవత్సరం నాటిది. అప్పుడే నాకు కొంచెం బుద్ధిబలం తగ్గడ మారంభించడంచేత, తెనాలిరామలింగంగారి ''ప్రాయపుప్రొద్దంత కొంత పడమటదిరిగెన్'' అనేస్థితిలో వున్నాను. అంతకుముందైనా యేవో కొన్ని పద్యాలు మాత్రమే యేకసంతకు వస్తాయిగాని అన్నీరావు. అర్థం తెలిసేవైతే రావడాని కభ్యంతరం వుండదు. కాని అప్పటిస్థితిలో ఆలాటిది కూడా యేకసంతకు రావడం అనుమానాస్పదమే. ఆ యీ సందర్భాలు వున్నవున్నట్లుగా చెప్పేటప్పటికి ఆయన అన్నారుగదా; పోనీ రెండు సంతలకు చదివినా చాలునని యీ క్రింది పద్యాన్ని చదివారు. -

ఉ. పెండెలనాగి చెక్కులను పెద్ది కటిస్థలి, గంగిగుబ్బచన్
గొండల నుండు రామకవికుంజరు హస్తము క్రిందుచేసె, హా!
పండక బంటుమిల్లి, అది పండిన యీ కసుమాలధారుణీ
మండలనాథుబోలు నొక మానవనాయకు వేడనిచ్చునే?

నేను సుళువుగా రెండుసంతలకు వప్పగించాను పై పద్యం. ఆయన సంతోషించారు. యీ పద్యం తురగా రామకవిగారి చాటుధార. యీాయన తాలూకు అగ్రహారం బంటుమిల్లి పండకపోతే, శ్రీ మొగల్‌తుర్తి ప్రభువుల సందర్శనానికి వెళ్ళేటప్పటికి దివాన్‌జీగా దన్నారట:- యీాయేడు దివాణం పనిన్నీ కిచ్చాటుగానే వుంది వచ్చేయేడు దయచేయాలన్నారట. దానిమీద కవిగారికి కోపం వచ్చి ''పనసకాయదొరికినప్పుడు తద్దినం పెట్టుకోవాలిగాని తద్దినం వచ్చినప్పుడు పనసకాయెక్కడ దొరుకుతుం'' దని పై పద్యాన్ని చెప్పాడట! ఆ పద్యం వల్ల నాటికవుల నిరాఘాటత్వం మనం తెలుసుకోవచ్చు. ''పెద్దాపురపుకోట పెద్దమ్మ కిల్లొట కవివరేణ్యుల కోపకలనగాదె'' అన్న మా శ్రవణానందంలోని కవి వరేణ్యుడు యీ రామకవిగారే. పిండిప్రోలు లక్ష్మణ కవిగారు మొదలయిన వారు యీ తురగా రామకవిగారిని వేములవాడ భీమకవిగారితోపాటు గౌరవించి వున్నారు - ''ఉంగుటూరిళ్ళ రాకాసు లుండవచ్చు'' అన్నది కూడా యీ రామకవిగారే. యీాయనవాక్కు మంచినిగాని చెడ్డనుగాని సాధించడంలో పేరుబడింది. మంచివిషయమైన గాథలున్నట్లే లేదు. చెడ్డ లెక్కువున్నాయి. వాట్లను వుదాహరించడాని కీవ్యాసం పుట్టలేదు కనుక స్పృశించి వదలుతున్నాను. యిట్టికవులెవరో కొందఱున్నారని ప్రతీకవి కవిత్వాన్ని బట్టి యీాలాటి మంచిచెడ్డలు జరుగుతాయని విమర్శించే నేటి విమర్శకుల ధోరణి శోచ్యము. దీన్ని గుఱించి నేటరేపట గొంత ప్రసక్తి కలిగితే కలుగుతుందని కొంచెం వాసనగొట్టడం చేత యింతదాకా ప్రస్తావించాను.

## గురువులవారి శిష్యవిత్తాపహారిత్వం

శ్రీరాజావారిని గురువుగారి దర్శనానికి పంపించివుంది కథాసరస్వతి. యింక అక్కడ జరిగిన సంగతి సందర్భాలు వ్రాయాలి. యేముంది. 'కట్టేడు - కొట్టేడు' అన్నమోస్తరుగా వ్రాస్తే యిదివఱకే ముగింపయేది. మధ్యమధ్య యితర ప్రసంగాలవల్ల కొంత పెరిగింది. కానివ్వండి. గురువులవారికి పాదపూజ వక లక్షకు తక్కువ స్వీకరించడానికి సంకల్పం లేకపోయింది. రాజావారో? యేభైవేలకు మించి యిచ్చేసంకల్పం లేకపోయింది. వారికీ వీరికీ కొంతవఱకు మృదువుగానే కొంత చర్చ జరిగివుంటుంది. శ్రీ రాజావారు గురువులవారి ''శిష్యవిత్తాపహారిత్వం'' బాగా కనిపెట్టారు. ''శిష్యవృత్తాపహారులు'' వీరు లేశమున్నూ కారనుకున్నారు. యిట్టివారిని మనం పిలిపించడమే ప్రథమ తప్పిదమనుకొన్నారు. యేభైవేలుకూడా ఆయన అంగీకరించినప్పటికీ ఇవ్వడం దుర్వ్యయమే అనుకున్నారు. యీ దుర్వ్యయం లేకుండా చేసినందుకు గురుపీఠం వారు అభినంద్యులనుకొన్నారు. యేమనుకొన్నప్పటికీ గురుత్వం వదులుకోడానికి వీలులేదే! దానిలో యివేమైనా స్మార్తగురుత్వాలా? 'అర్థం ప్రాణం ఆచార్యాధీనం' అనే తరగతిలోవి కదా?

## జుట్టుకోత ప్రకరణం

మా రాజావారి వద్ద యీ అర్థప్రాణాచార్యాధీనాల ఆటలు కూడా సాగుతాయా? ఆయన మహా యుక్తిశాలి. చక్కగా ఆ శిష్యత్వాన్నుండి తప్పించుకున్నారు చూడండి. లోపల గురువుగారి మీద బోలెడు కోపం వచ్చింది. అలా కోపం రావడమే తటస్థిస్తే ఆ రోజుల్లో మా రాజావారికి యెవరిమీద వచ్చిందో వారి జుట్టు వుండేది కాదు, కాని ఆ జుట్టుకు యెన్ని సంచుల రూపాయిలో వెంటనే ముట్టేవి అని యిప్పటికిన్నీ చెప్పుకుంటారు. జుట్టు పోగొట్టుకొని రూపాయిలు స్వీకరించిన వారిలో

యిప్పటికెవరున్నూ మిగిలినట్లు లేదు. యాభై అర్వై యేళ్ళనాటి ముచ్చట్లు. యీ సంగతి తెలిసి కొందఱు కొందఱు ధనసంపాదనకు యిది మంచి వుపాయమని రాజాగారి వద్ద కొంత తెలివి తక్కువగా నడవడాన్ని ఆరంభించేవారట. యెందుకంటే ఆ కాలంలో యిప్పటికాలంలోలాగా - సకలమ్మున్ గొరిగించుకోవడం ఫేషను కాకపోవడం చేత, జుట్టుపోయిందంటే పెద్ద అవమానమేకాని, ఆ అవమానానికేమి, పోతేపోయింది వెధవజుట్టు, మళ్ళా పెరుగుతుంది. ''శాకినీవ దినేదినే'' వేలకొలది సొమ్ము దానంతటది వచ్చి యింట్లో పడుతుందిగదా! అని ఆ పెద్ద మనుష్యుల ఆశ. ''బోలెడు తిట్లయినా బొక్కెడు కొజ్జులుగా'' వంటారుకదా పెద్దలు? అయితే అలా ప్రయత్నించినవారి జుట్టుమాత్రం మారాజావారి ఆయుధానికి వక్కటీ కూడా బలి అయినట్లు నేను వినలేదు. యెంతసేపూ వారి దివానులవీ, అడపాదడపా గవర్నమెంటు వుద్యోగులవీ అరుదుగా పండితులవీ పోతూవచ్చాయి. పండితులంటే ఆకాలంలో ఆ బిరుదు రావడం సామాన్యంగా వచ్చేదికాదు. కావ్యనాటకాలంకారాలు పూర్తిగా చదివినవారికి ఆ బిరుదు వుండేదేకాదు. సాహిత్య గాళ్ళనే వారు వారిని. ఏదో వక శాస్త్రంలో పూర్తిగా పాండిత్యం సంపాదిస్తేనే పండితుడనడం. ప్రస్తుతం పండిత అనే బిరుదు బహు తేలికగా సంపాదన అవుతూవుంది. దీన్నలా వుంచుదాం.

## పొక్కునూరి వేంకట శాస్త్రులుగారు

పండితులలో అనగా సాహిత్యపరులలో పొక్కునూరి వేంకట శాస్త్రులు గారనేవారొకరు శ్రీ రాజావారితో బహు చనువుగా మాట్లాడేవారుండేవారట! శ్రీవారున్నూ యీ శాస్త్రుల్లుగారున్నూ సహాధ్యాయులని వినడం. యే చదువు సందర్భంలోనో తబిసీలు తెలియదుగాని బహుశః కావ్యపాఠ సందర్భంలో అయి వుండాలి. రాజావారు యెవరేనా పండితులు వస్తే వారితో ధారాళంగా సంస్కృతమే మాట్లాడేవారని వినికి. ఆ కారణం చేత వారు బాల్యంలో సంస్కృతభాష అభ్యసించి వుండాలి. ఆ సందర్భంలో యీయన రాజావారికి సహాధ్యాయులో సతీర్థులో అయివుండాలి. ఆ చనువుచేత ఆంతరంగికులుగా వుండడమే కాకుండా యీయన రాజబంధువులకేమి పండితులకేమి యెందఱికో రాజావారిచేత యెన్నో వుపకారాలు చేయించినట్లు వినికి. అంత చనువుండడం వల్ల నిర్భయంగా మాట్లాడుతూ వుండడం వుండేదేమో. దానిలో యేం పొరపాటొచ్చిందో వక పర్యాయంకాబోలును రాజాగారి కత్తికి శాస్త్రుల్లుగారి జుట్టుపిలక పనిచెప్పినట్లు వింటాము. ఆ పిమ్మట కూడా వారిద్దరికీ వున్న బాల్యమైత్రికి లోటులేకుండానే జరిగినట్టున్నూ వింటాము. ఆ కారణంచేతనే ఆ శాస్త్రుల్లుగారెప్పుడో మళ్ళా రాజాగారు కులాసాగా మాట్లాడుతూవున్న సందర్భంలో యీ జుట్టుకోత ప్రసంగం వచ్చేటప్పటికి ''మహాప్రభో, నా జుట్టు యెంతో అదృష్టం పెట్టిపుట్టింది కనక మీవంటి మహాప్రభువుల కత్తికి యెరయింది'' అంటూ యింకా కొంత మోటుగానే మాట్లాడినట్లున్నూ, ఆ యుక్తికి రాజావారు చాలా సంతోషించినట్లున్నూ కూడా వినికి.

## వక కమ్మకులీనుడు

ప్రసక్తానుప్రసక్తంగా జుట్టుకోత ప్రకరణంలోకి దిగాంగనుక యీ ప్రకరణం తరువాయికూడా యేకరు పెట్టేసే ప్రధానాంశంలోకి వస్తాను. గృహస్థులలోకి శ్రీ రాజావారికి మిక్కిలీ ప్రేమపాత్రుడైన సంపన్న గృహస్థు వక కమ్మకులీనుని జుట్టుక్కూడా యీ అదృష్టం పట్టిందట. కాని వెంటనే నలభైవేల రూపాయీల సంచులను యేనుగుమీద వేసికొని రాజావారు ఆ ఆసామీని గౌరవించడానికి స్వయంగా మితపరివారంతో వస్తాదు సహితంగా ఆయన గ్రామానికి దయచేసినట్టున్నూ, ఆ కమ్మ కులీనుని మేనల్లుళ్ళు వగయిరా అసలాయన యెంతచెప్పినా వినక రాజావారిని అవమానించే ప్రయత్నం పూర్తిగా చేసినట్టున్నూ, యేలాగయితే యేమి వస్తాదు తెలివితేటలవల్ల ఆ గండాన్నుండి తప్పించుకొని రాజావారు సురక్షితంగా కోటలోకి చేరుకున్నట్టున్నూ వినికి. కాని అసలు జుట్టుకోతబడ్డ ఆసామీ మిక్కిలీ రాజభక్తుడున్నూ రాజావారి మృదుహృదయమున్నూ తాత్కాలిక కోపమున్నూ యెఱింగినవాడున్నూ అవడం చేత, లేశమున్నూ తన మేనల్లుళ్ళ దురాగతానికి సమ్మతింపనేలేదని యేకగ్రీవంగా అందఱూ చెప్పుకుంటారు. అయినా తుదకు మేనల్లుళ్ళు చేసిన పనికి ప్రతిఫలంగా ఆ ఆసామీ యేడు సంవత్సరాలు కాబోలును కఠినశిక్ష అనుభవించి విడుదల కాకుండా ఖయిదులోనే కాబోలును మరణించినట్లు విన్నాను.

మధురవాణి మాటకచేరి

# పిట్టపోరు పిట్టపోరు.....

– సత్తెనపల్లి రామమోహనరావు

(ప్రస్తావన

గురజాడ అప్పారావుగారు సృష్టించిన అజరామరమైన పాత్ర మధురవాణి. కన్యాశుల్కం నాటకానికి వన్నె తెచ్చింది మధురవాణే. ఆ నాటకంలోనే కరటకశాస్త్రి అనే ఆసామి - ''మధురవాణి అంటూ ఒక వేశ్యాశిఖామణి యీ కళింగ రాజ్యంలో వుండకపోతే భగవంతుడి సృష్టికి యంత లోపం వచ్చివుండును-'' అంటాడు. కళింగరాజ్యం మాట ఏమోకాని మధురవాణి లేకపోతే కన్యాశుల్కం నాటకానికి మాత్రం తీరని లోటు ఏర్పడి వుండేది. ఆ నాటకానికి వెలుగునీడల వంటివారు మధురవాణీ, గిరీశంలు. గిరీశానికి అన్నీ వున్నాయి. అతగాడు చదువుకున్నవాడు. సంఘంలో ఒక స్థానం కలవాడు. తెలివిగలవాడు. అయినప్పటికి మోసంతోనే బ్రతుకును గడపాలనుకుంటాడు. మధురవాణికి యివేమీ లేవు. చదువు అంతంత మాత్రమే. సంఘంలో ఎటువంటి స్థానమూ లేకపోగా, కాని వృత్తిని నమ్ముకొని బురదలో కూరుకుపోయి వుంటుంది. అయినా తన మంచితనంతో, తెలివి తేటలతో, చురుకుతనంతో ఆ బురద తనకు అంటకుండా వికసిత కమలం వలె నవనవోన్మేషంగా పైకి వస్తుంది. కన్యాశుల్కం నాటకానికి మెరుపులు అద్దుతుంది. అలాంటి మధురవాణి వర్తమాన విశేషాలపై తనదైన బాణీలో విశ్లేషణను కొనసాగిస్తే ఎలా వుంటుంది అన్న ఆలోచనలో నుంచి ఉద్భవించింది యీ ''మధురవాణి మాటకచేరి'' అనే శీర్షిక. ఈ శీర్షికలో మధురవాణి ప్రతినెలా ఒక బర్నింగ్ పాయింటును (తాజా విశేషం అందామా?) గురించి మాటకచేరీ కొనసాగిస్తుంది. అవధరించండి! సన్నాయి రాగాలాపన లాంటి ఆ మాటల మేజువాణీని!.....

– రచయిత)

ఏదో ఆయన పుణ్యావా అని గిరీశంగారు అప్పుడప్పుడూ చెబుతూ వుండబట్టి కాని లేకపోతే పాలిటిక్స్ అంటే ఏమిటో నాకు ఒక్కమాట కూడా తెలియకపోను. గిరీశంగారికి రాజకీయాలు కొట్టినపిండి. ఒపినియన్సు ఛేంజి చేస్తుంటేకాని పాలిటిషను కానేరడు- అని ఆయన అంటూ వుండేవాడు. అన్న ప్రకారమే ఒపినియన్సు తెగ ఛేంజ్ చేస్తుండేవాడు. మాటలు మార్చటంలో ఆయనకు ఆయనే సాటి. అప్పటికి రాజకీయ రంగం యీనాడంత విస్తృతం కాలేదు కాబట్టి కాని, లేకపోతే ఆయన యింకా ఎంతో పేరు తెచ్చుకొని యింకా ఎంతో గొప్పవాడయిపోయి వుండేవాడు. అప్పట్లోనే నేను సురేంద్రనాథ్ బెనర్జీ అంత గొప్పవాణ్ణి అని ఆయన చెప్పుకునేవాడు. నేనే వెర్రిమాలోకాన్ని కాబట్టి తెలియక సురేంద్రనాథ్ బెనర్జీ ఎవరూ అని అడిగాను. దానికాయన సురేంద్రనాథ్ బెనర్జీ ఎవరో చెప్పలేదు కాని - తనని గురించే చాలా చెప్పుకొని చివరకు సురేంద్రనాథ్ బెనర్జీ తనంత గొప్పవాడని లెక్క తేల్చాడు. అదీ అసలైన రాజకీయమంటే అని అప్పుడు నాకు అర్థమైంది. అందుకే గిరీశం గారితో మాట్లాడ్డమే ఒక గొప్ప ఎడ్యుకేషన్ అని నేనూ ఒప్పుకుంటాను. పల్లెటూరి పీపుల్ లెక్చర్లకి అన్‌ఫిట్ అనేవారు గిరీశంగారు. ఒకసారి ఆయనొచ్చిన బండివాడికి నేషనల్ కాంగ్రేస్ విషయమై రెండు ఘంటలు ఏకబిగిన లెక్చరిస్తే - కొసాకి వాడు వాళ్ళ ఊరు హెడ్‌కానిస్టేబుల్ని కాంగ్రెస్‌వారు ఎప్పుడు బదిలీ చేస్తారని అడిగాట్ట.

ఆమాట చెప్పి గిరీశం గారెంత విసుక్కున్నారో యిప్పటికీ నాకు గ్యాపకం వుంది. అందుకే ఆయన విలేజస్‌లో లెక్చర్లు యంత మాత్రం కార్యంలేదు అన్న నిర్ధారణకు వచ్చేశాడు. అయితే నాకు ఆ బండివాడు అడిగినదాన్లో తభావతేమీ కనిపించటం లేదు. కుక్క పరుగు కుండ దాకానే అన్నట్లు ఎవరి

ఆలోచనలయినా వారికి సంబంధించిన సమస్యల చుట్టూనే పరిభ్రమిస్తూ వుంటాయి కదా! కాంగ్రెసువారయినా, కమ్యూనిస్టులయినా కనీసం తను ఓటేసిగెలిపించిన ఎమ్.ఎల్యే అయినా ఆ బండివాణ్ణి బాధపెట్టే పోలీసు స్వామిని బదిలీ చేస్తే అతగాడు కాస్త సుఖంగా బతకగలుగుతాడు. లేకపోతే ఎంత నేషనల్ కాంగ్రెస్‌వల్లమాత్రం తనకేం ప్రయోజనం వుంటుంది కనక? --అందుకే ఆ బండివాడు గిరీశంగార్ని అలా అడిగాడు. ఈ మాత్రం అసలు సత్యాన్ని అర్థం చేసుకోలేక ఆయన అతగాడి మీద విసుక్కున్నాడు. ఏ రాజకీయాలన్నా తమకేమాత్రమన్నా ఉపయోగిస్తేనే కదా తమ బతుకుల్లో ఏకాస్తయినా ఊరట కలిగిస్తేనే కదా మామూలు మనుషులకు వాటిపట్ల ఉత్సుకత కలిగేది. లేకపోతే ఎవరొస్తే నాకేమిటి ఎవరు రాకపోతే నాకేమిటి అనే నిర్లిప్తభావం అంకురించదూ....?

ఇప్పుడు చూశారు కదా టెక్కలి సీటు ఎవరికివ్వాలి అన్న విషయంలో తెలుగు దేశంలో ఎంత హడావిడి జరిగిందో ఎన్ని తర్జన భర్జనలు జరిగాయో.... ఆ సీటు తనకిస్తే బాగుంటుందని లక్ష్మీపార్వతి అనుకొంది. తెలుగుదేశం అధినేతకు, తెలుగు దేశానికీ తనెంతో సేవ చేశాను కాబట్టి అలా యివ్వటం అన్ని విధాలా న్యాయమని ఆవిడ అభిప్రాయ పడింది. ఇదిలావుంటే ఆ సీటు తనకిమ్మని అబ్బాయి హరికృష్ణ అడిగాడు. ఎన్నికల సమయంలో చైతన్య రథసారధిగా తను తండ్రివెంటే అవిశ్రాంతంగా తిరిగాననీ కార్యకర్తల మనోభావాలు హృదయగతం చేసుకున్నాననీ కాబట్టి ఆ సీటు తనకే యివ్వటం ఉచితం అనీ అబ్బాయి అనుకున్నాడు. దాంతో తెలుగుదేశంలో అంతఃపురమే కాక డ్రాయింగ్‌రూమ్ కూడా రాజకీయాలతో వేడెక్కిపోయింది. ఈ దశలో ఎన్టీఆర్ ఏం చేస్తారు ఎటు మొగ్గుతారు అన్న విషయం మీదే అందరి దృష్టి కేంద్రీకృతమయి పోయింది.

వెనక ఎన్టీఆర్ ''తల్లా? పెళ్ళామా?'' అని ఒక సినిమా తీశారు. అందులో హీరోకి తల్లిని ఆదరించటమా, పెళ్ళాం మాట వినటమా అనే గొప్ప చిక్కు ఎదురౌతుంది. అదే సమస్య కాస్త రూపుమార్చుకొని మళ్ళీ ఎదురయింది. కొడుకా? పెళ్ళామా? అని తేల్చుకోవలసిన పరిస్థితి ఎదురయింది. వెనకటి సినిమాలో హీరో ఆ సమస్యను ఎలా పరిష్కరించాడో కాని ప్రస్తుతం యీ సమస్యను ఎన్.టి.ఆర్ ఎలా పరిష్కరిస్తారా అని అంతా ఎంతో ఉత్కంఠగా ఎదురు చూశారు. రాజకీయాలు అట్టే తెలియని నేనే ఎన్.టి.ఆర్. ఏం చేస్తారా అని సస్పెన్సుతో తల్లడిల్లిపోతే నిత్యం రాజకీయాలలో బుడుంగు, బుడుంగు మంటూ మునిగి తేలేవారికి యింకెంత సస్పెన్సుగా వుంటుందో వేరే చెప్పాలా?....

జనం అంతా యిలా మల్లగుల్లాలు పడుతుంటే ఎన్.టి.ఆర్ మాత్రం విమ్మకు నీరెత్తి నట్లుగా ఊరుకున్నారు. చూస్తారుగా ఎవరికివ్వాలో నిర్ణయించటంలో నా మగతనం నిరూపిస్తాను అన్నారు. చివరకు పిట్ట పోరు పిట్టపోరు పిల్లి తీర్చినట్లు ఆ సీటు అర్థాంగికీ కాక, అబ్బాయికీ కాక స్థానికులకే యిస్తానని ప్రకటించారు. ఇందులో మగతనం, ఆడతనం ప్రసక్తి ఏముంది కాని ఎవరికిచ్చినా టెక్కలి నియోజక వర్గ ప్రజలకు ఏమాత్రం లాభం కలుగుతుందనేది గవరయ్య మావతో అంజనం వేయించుకొని తెలుసుకోవాల్సిందే. ఎవరికిస్తే ఏమిటే ఎవరయినా ఏదో పండుగకు, పబ్బానికీ సభలకు సమావేశాలకు రావటం తప్ప అక్కడ గెలచి హైదరాబాద్‌లో మకాం పెట్టడమేగా చేసే నిర్వాకం అంటుంది మానేస్తం రాంభొట్లగారి అచ్చమ్మ. వెర్రిబాగుల్ది అనుకుంటాం గాని అచ్చమ్మ కూడా ఒక్కోసారి తెలివిగానే మాట్లాడుతుందండోయ్!...

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi ProcessLtd., 1-1-60/5, Iftekar Mansion Lane, RTC X Roads, Musheerabad, Hyd-20.
Ph. 612436, 612337

**Editorial NEST**
Plot No. 337-A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 033. Phone : 247717.



కాలిఫోర్నియాకు చెందిన జరామహ్లెర్ తన పెంపుడు కుక్క తో నృత్యం చేస్తున్న దృశ్యం.

